365

రచయిత

శ్రీ పిఠాపురం



8 అణాలు

స్టాకిస్టు:

యస్. అప్పలస్వామి అండు సన్సు

పబ్లిషర్సు :: రాజమహేంద్రి.

1945

# ప్రాయశ్చిత్తం

రచయిత:


శ్రీ మానాపురం అప్పారావు పట్నాయిక్.





పబ్లిషర్:

కందుల గోవిందం,

జనరల్ బుక్ డిపో, రాజమండ్రి.

1945




—

[వెల 0-8-0

# సూచన!

కర్షక జీవుల రక్తాన్ని పిండి వారి శ్రమతో వ్యాపారాన్ని దిగ్విజయంగా సాగించుకొంటూ అధిక ధనవంతులైన ఫ్యాక్టరీయజమానులు, ఎవరి కాయకష్టంవల్ల తాము అంతటి ఔన్నత్యాన్ని గౌరవాన్ని అందుకొంటున్నారో ఆ బీదజీవుల సుఖసౌఖ్యాలతో నిమిత్తంలేకుండ ధనకాంక్షతో వారి జీవితాలమీదికి దాడి సల్పడం పరిపాటిగా ఉంది—

న్యాయాన్ని గుర్తించి ఉన్నత హృదయంతో కర్షక జీవుల తరఫున తిరుగబడి వారిహక్కులకోసం అలజడి పరచాడంటే అట్టి ఆదర్శ జీవిని ప్రపంచంలోనుంచే తొలగింప చూస్తారు ధనాశాపరులైన నేటి కంపెనీ అధికారులు—

న్యాయంకోసం ఎదురుతిరిగి నిలచిన ఒక ఉత్కృష్టజీవి కష్టాలను కథారూపంగా యిందు పొందుబరచాను. ఇక చదవండి—

ఇట్లు,
మానాపురం.

శ్రీనివాసా ప్రెస్, రాజమండ్రి. సెప్టెంబరు 1945—1000

# 1

'ఈదినం కూడానా?—'

'ఆ! ఈదినంకూడ కూలీలు పనిలోనికి రాలేదండి.'

'వరసగా మూడురోజులే స్ట్రయిక్!'

'ఆ. ఇంకా చేస్తారని వింటూన్నానండి.'

'అలా ఎంతకాలం చేస్తారు? ఎంతకాలం జరుగుతుందని వారి ఆలోచన. పట్టుమని పదిహేను దినములు మనం పట్టుదలగా ఊరుకొన్నామంటే బయటు వాటాలులేక వెధవలు దీపంతో డీకొనే అల్పపురుగులులా మాడిపోవరూ?—'

'అంతకాలం ఉపేక్షచేస్తే బుక్ చేసిన ఆర్డరు దారుల సరకు సకాలానికి అందని కారణంచేత వర్తకులు ఆర్డర్లు మనక్రింద రద్దుపరచి యితర కంపెనీలకు యిచ్చుకొంటే కాతాలు తిరిగిపోయి వ్యాపారం నష్ట పడదూ!—'

'నిజం. ఆసంగతి నాకూ తెలుసు. కాని మనం తొందర పడుతూన్న మనవర్తక రహస్యం ఆవేబర్సుకి తెలుస్తే ఇహాంమనలను నిలువనిస్తారా? అడుగడుగుకూ అనేక నిబంధనలతో హక్కులపట్టీని మన ముందు హాజరు పెట్టరూ!—'

'ఆసంగతి యిప్పుడు వారికి తెలియకపోతేగా క్రొత్తగా వారికి తెల్పేందుకు.'

'వర్తక రహస్యాలు వారికెలా తెలుస్తాయి గోపాల్! కేవలము పేపర్లలోని సమ్మె శీర్షికలను ఆధారం చేసుకొని ఏదో అలజడిచేస్తే అక్కడివారిలాగే మనదగ్గరకూడ సొమ్ము గుంజుకొనవచ్చునని వారి నమ్మకం.'

'వారికి అసమ్మతం కలిగించిన వ్యక్తి ఉన్నాడు. వాడివల్లనే యింత అల్లరికి కారణమైంది. వాడు లేవదీసిందే ఈసమ్మె—'

'అవును. నేను ఎరుగుదును. ఏదో కమ్యూనిస్టు పార్టీలంటూ పేరులు ఏర్పరచుకొని పనిపాటాలేక ఊరంట ఓజోలి చేతికి తగిలించుకొని దేశసంరక్షకులమంటూ, కర్షక మిత్రులమంటూ పూర్వమే వల్లించుకొని సిద్ధపరచుకొన్న ఏఎంగిలి పదాలనో నాలుగు కల్పించి పనిచేసుకొనే మెరటిమనుష్యులమధ్య గుప్పి, వారికి లేని హక్కులను సృష్టించి, వాటికోసం సమరం లేవదీయాలనే పట్టుదల వారిలో లేవదీసి, దాని మూలంగా ఆదౌర్భాగ్యపు ప్రజలలో సమ్మెకాని పుట్టించి డోనేషన్ అను పేరుతో చేసిన వసూళ్లను దిగమింగుతూ—'

'అట్టివాడుకాడు- ఈసమ్మెకారుడు. బూటకపు మాటలతో సమ్మె చేయించే కమ్యూనిస్టు నాయకుడు అయితే ఏనాలుగు పచ్చ కాగితాలో అలా వాడిమోహాన్ని పారేసి మనపనికి అడ్డురాకుండా వాడిని కట్టేసి ఉందును. దానితో ఆలేబరంతా వారిపనులు వారుసాగించుకొనేవారు—

'అయితే ఈస్ట్రయిక్ కి కారణం?—' అని చెమారామలాల్ మేనేజరు గోపాల్ సింగును అడుగుతూంటే ఆతని కుమార్తె బీనాకుమారి కాలేజినుంచి పుస్తకాలతో ఆగదిలోనికి తొందరగా వచ్చింది.

'తల్లీ! కాలేజీనుంచేనా?'

'ఊ. కాలేజీనుంచే వచ్చాను. ఈదినం వారు ఆలస్యముగా వచ్చింది కాలేజికి అంచాత—'

'అవును తల్లీ- ఏదో పనితొందరలో కారుతిరుగుతూంది. అంచేత కారు కాలేజీకి రావడం ఆలస్యమైంది.' అని రామలాల్ కండ్లలో గారాబాన్ని చూపుతూ కుమారి బీనాతో మాట్లాడుతూంటే ఆమెతో మాట్లాడే అదునుకోసం ఆశతో చూస్తూన్న గోపాల్ సింగు వారిమాటలలో కల్పించుకొని—

# ప్రాయశ్చిత్తము

'క్షమించండి. అవసరంగా కంపెనీ పనిమీద కారు తీసుకొని వెళ్లాను. అంచేతనే తిరుగ పంపడం ఆలస్యమైంది.' అని చెపుతూంటే-ఆమె ఆతనిమాటలు వినిపించుకొనకుండానే తండ్రితో—

'బాబాయి—మనకంపెనీలో పనివాళ్ళు సమ్మె కట్టారని పేపర్లో పడిందే? ఎంచేతండి వారు సమ్మె కట్టడం—'

'ఆవిషయములో మేనేజరుగారితో మాట్లాడుతూన్నాను. ఆవ్యాపారంసంగతి నీకు తెలియదులే తల్లీ. నీవు వెళ్లి నీకాలేజీ పనులు చూసుకో.'

'కాలేజీనుంచేగా వచ్చాను. ఇహ కాలేజీపనులేమీలేవు.'

'సరే. నీవు లోనికివెళ్లు. ఏదో వ్యవహారం మాట్లాడుతున్నాం-' అని చెంపూరామలాల్ ఆమెతో చెపుతూండగనే ధర్వాన్ గడ్డము సాహేబు లోనికివచ్చి ఆయన సలాం చేశాడు.

'ఏం ఆలీ! ఎవరైనా మాదర్శనంకోసం వచ్చారా!'

'జీ సాబ్—'

'ఇప్పుడు రావీలులేదు. అంతగా అవసరిండుంటే బయట గదిలో ఒక అరగంట కూర్చోమను.'

'జీ సర్కార్—' అని సాహేబు వెళ్లబోతూంటే మేనేజరు తన తీవిని ఒలికిస్తూ ఆతనివంక చూచి—

'ఆలీ!—'

'జీ సాబ్!'

'ఆవచ్చినది రంగాప్రసాద్ కాదుకదా!'

'ఆయనకూడ ఉన్నారండి.'

'కూడా అంటూన్నావు యింకా ఎవరున్నారు ఆతనితో.'

'కంపెనీ స్ట్రయిక్ చేయించిన కృష్ణారావుకూడ ఉన్నారండి.'

'ఓ! వాడిని రంగాప్రసాద్ మాయచేసి తీసుకొని వచ్చాడన్న మాట!' అన్నాడు మేనేజరు ఏదో తనమూలంగా జరిగిన మహాత్కా ర్యంలా తల ఊపుతూ—'

'ఎవరు తీసుకొనిరాబడిన వ్యక్తి!—

'వాడు. ఆ ఆంధ్రా టీచర్!—'

'అంటే?—'

'ఇప్పుడు చెప్పనే స్ట్రయిక్ లీడరని.'

'కమ్యూనిస్టులీడరు లేడన్నావుగా?—'

'అవును. ఆకమ్యూనిస్టు లీడరుకాదు. ఈతడుకూడ ఈమధ్యనే కూలీలతో కూలిగా ప్రవేశించి కంపెనీలో పనిచేస్తూ ఈఅల్లరిని లేవ దీసి యింతపని చేశాడు.'

'ఒకలేబరర్— కూటికి, ఆశించి కూలికోసం చేరిన ఒక సాధా రణ వ్యక్తి సమ్మెను లేవదీయబోతూంటే వాడినిఅరకట్టలేకపోయారా?'

'వాడి ప్రవర్తనచూచి వాడిని డిస్మిస్ చేయబోతే తక్కిన లేబ రంతా తిరుగబడింది. అంచేత వీలుగాక అవకాశం కోసం ఎదురు చూస్తూంటే యింతలోనే యింతగంద్రగోళం చేసి కంపెనీకి పెద్ద నష్టం తీసుకొని వచ్చాడు.'

'అరే!—ఎంతపని చేశావ్ సింగు!— వాడినే పట్టుకొనలేక పోయావా?—'

'పట్టుకొనే అవకాశం వాడునాకు చూపలేదండి.'

'పోనీ- ప్రమోషనంటూ పెద్ద జీతంమీద వాడికి మరో సైప్ చూపెట్టి త్రిప్పుకోలేక పోయావా?'

'ఇంకా వాడు పనికే కొర్తిగా!'

'పోనీ- కొంతడబ్బు పారవేయలేక పోయావా?—'

'అందుకే వాడిని ఓమాటుగా ఆఫీసుగదికి రావించి మోగించి

చూశాను. కాని వాడు త్రోవలోనికి రాందే!— పైగా ఎంతదారాళంగా మాట్లాడుతాడనుకొన్నారు ఇంగ్లీషు! ఒకటేమిటి! హిందీకూడ స్వంతభాషలాగే మాటలాడుతాడు. తెనుగు సరేసరి, వాడిమదర్ టంగ్ట. ఇంకా అరవము, మళయాళము—

'ఐతే— ఈదేశాలు తిరిగిన బికారి వెధవ మనప్రాణాలమీాదకి ఎక్కడపోగయ్యాడు! మనకోసమే దిగినట్టుందే వీడివేషం చూస్తే!— మనం వాడికి ఏంపగవాళ్ళమని పగబట్టివచ్చాడు.'

'వెయ్యినియ్యండి గంతులు! ఎంతకాలము వెయ్యగలడు ఆ గంతులు! కాళ్లునొప్పిపెట్టేవరకే ఆపెంకితనం. నెమ్మదిగా ఏక్రియివో వాడినెత్తినితోసి పోలీసు ఆఫీసర్లయిన్నిలియన్సుతో జయిలుకు పంపం చామంటే సరి. పేరూ ఊరూ లేకుండా పోతాడు.

'ఆపనిఅయినా ఎందుకుచేయించావు కావేమోయి!—'

'ఇంతవరకు వస్తుందని నేనుమాత్రం అనుకొన్నానా గాని— సామాన్యసాలేబరు ఏమిచేయగలడు?అని అనుకొన్నాను. ఈలా అవుతుందని నేనుమాత్రం ఎరుగుదునా? వీడిలాటివారు ఎంతమంది జయిలుకుపోయి పేరుప్రతిష్టలులేకుండా నశించిపోలేదు! అంతకంటె వీడులెక్కా—!' అని మేనేజరు తనవాగ్ధాటినంతా చేతులు త్రిప్పుతూ ప్రదర్శిస్తూంటే ధర్యాన్సాహెబ్ గడ్డంను ఎడమచేతిలో దువ్వుకొంటూ—

'సర్కార్—వారిని లోనికిపంపమంటూరాండి!—' అన్నాడు.

'ఊ—రమ్మను. వాడిఆశయంకూడ తెలుసుకొందాం అని చందూరామలాల్ అంటూంటే స్ట్రయిక్ కారణాన్ని తెలుసుకొన కుతూహల పడుతూన్న బీనాకుమారి తండ్రిప్రక్క కుర్చీలో కూర్చుంది. స్ట్రయిక్ చేయించినవాని రాకకోసం ముగ్గురికండ్లూ ముందుకు చూస్తున్నాయి.

రంగాప్రసాద్ వెనుక కృష్ణారావు చిన్నఅంగలు వేసుకొంటూ లోనప్రవేశించాడు. ఆతని రాకతో చందూరామలాల్ కండ్లు ఉరుము

తూన్నట్లు ఆతనివంక కోపంగా చూస్తూన్నాయి. త్రొక్కిపెట్టుకొంటూన్న కోపం ఆతని ముఖాకూడికలో కనబడుతూనే ఉంది.

రావడంతోనే దూరంగా అమర్చబడిన షేముకుర్చీలో రంగాప్రసాద్ కూర్చున్నాడు. కృష్ణారావుమాత్రం వారు ఆసనించూపని కారణంచేత గౌరస్థునిలాగే చేతులుకట్టుకొని వారు ముందు నిలువబడ్డాడు—

కంఠంమెడ ఖద్దరుసలాల్చీతోనూ, పొడుగు వదులు పైరాయితోనూ, అల్లికజోళ్లు ఎదుటవారిని పలుకరించేలా పాలిష్ కాబడి మూతబడిన పైరాయిఅంచులనుంచి దోచూచిలాడుతూంటే కృష్ణారావు నిర్భయంగా వారిముందు నిలువబడి ఉన్నాడు.

ఐదు నిమిషములు నిశ్శబ్దం—

అందరికండ్లు ఆతనిముఖాం వంకే కేంద్రీకరింపబడి ఉన్నాయి. అందరూ తన్ను చూస్తూన్నారన్న జ్ఞానంతోనే బెట్టుగా, పెంకితనంగా, గోడమీాది అలంకారాలవంక ఆతనికండ్లు చూస్తూన్నాయి.

'ప్రసాద్! ఈతడేనా స్ట్రయిక్ ఆర్గనైజుచేసింది—' అన్నాడు చెందూరామలాల్ కండ్లు మెజస్టిక్‌గా క్రిందికివాల్చి సోఫాలో చేరబడుతూ—

'అవునండి—' అన్నాడు రంగాప్రసాద్ నమ్రతగా ఆయనవంక చూస్తూ,

'ఊ— ఈతడు లేబర్ పనివాడేనా?—'

'చిత్తం.'

'డయిలీ వేజెస్‌లోనివాడేనా?—'

'చిత్తం.'

'ఇప్పుడు ఈతడు మనదగ్గరికి ఏమిచెప్పుకోవాలని వచ్చాడు?'

'స్ట్రయిక్ కాంపనాన్ని చెప్పుకోడానికి వచ్చాడు.'

'కాదు. నాసోదరకూలీల గోడును తమకు వినిపించ కోరికతో వచ్చాను. మీమనసును కరగించి, వారికష్టములకు తగిన ప్రతిఫలం ముట్టచెప్పమని విన్నవించుకొనడానికే—'

'మీరు నూచేత యిప్పిస్తానని కూలీలకు వాగ్దానమిచ్చారా?' అన్నాడు చెంధు అదోలా ఆతనివంక ప్రక్కనుంచి కళ్లుత్రిప్పిచూస్తూ.

'ఇస్తారని ఆశచూపాను. కష్టాలు తెలుసుకొని తమరు కనికరిస్తారని—'

'ఊఁ. ఇలా స్ట్రయిక్ చేసి భయపెట్టి రాబట్టుకోవాలని ఆందోళన లేవదీశారా మీరు!—'

'ఆందోళనకేముంది! కూలీలమొరలు మీకు అందనికారణంచేత, ఈమార్గంవల్ల తమదర్శన దొరుకగలదని, దానితో మీరున్యాయాన్ని యోచించి—'

'చాలు. అంతా తెలుసుకొన్నాను మీరుపంపిన మహజరువలన అసలు నేను ఆషరతులు వప్పుకొనకపోతే ఏమిచేయాలని నీఉద్దేశం! స్ట్రయిక్ కంటె న్యూ చేయిద్దామనే యోచిస్తున్నావా!—'

"అంతవరకు తమరు రానివ్వరని నాకు తెలుసు"

"అంటే?—ఆషరతులకు నేను వప్పుకుంటాననే వారికి ఆశచూపుతున్నావా!—ఏవో పాడుమాటలు నాలుగుచెప్పి, వారిలో మొనగాడవని ముందుకువచ్చి చాతివిరచుకొని నిలువడంతో జడిసి తమరు కోరే ప్రతిహక్కునూ యిచ్చివేసే తెలివితక్కువ ప్రొప్రయిటర్సు అని యోచిస్తున్నావా!—"

"ఏవో సమాధానపరచగల ధీశాలురనే మాకష్టములు మీకు ఎరుకపరచుకొంటూన్నాము."

"తమరు లేదని భయపడుతున్నా ననుకొంటూన్నావా? —ఇప్పుడు తలుచుకొంటే నెల్లూరుజిల్లానుంచి వేనవేలు లేబరర్సును

రావించి నాపనులు నేను నిరాఘాటంగా జరిపించుకొనగలను. కాని— ఈపూరా కూలీలు పాడవుతారని మాత్రమే విచారిస్తున్నాను.”

“అంతప్రయాస మీకు అక్కర్లేకుండానే ఆకొద్దియేర్పాట్లు మీరుచేయిస్తే పనులు రేపటినుంచే జరుగుతాయిగా. పెద్దమొత్తములు మేము అడుగలేదే?— మనిషి అన్నవాడికి ఎంతపనుండాలో— ఎంత విశ్రాంతి ఉండాలో యోచించి పని కాలం నిర్ణయించమనీ, ప్రస్తుత పరిస్థితులవల్ల యిరువదిపెరసంటు కూలి హెచ్చించమనేగా మేము యింతకీ కోరింది!”

“పనికాలము తగ్గించమనీ, కూలి హెచ్చించమనీ, ఇంతేగా వారితరఫున నీవు కోరింది!— వహ్వా!— ఏమికోరిక!— మాఆయువు పట్టునే పట్టుకొంటే యిహవ్యాపారాలు ఏలాగుసాగుతాయని!—గాంధి ఖద్దరుబట్టలేగా కట్టమన్నది!— ఉప్పుసత్యాగ్రహాన్నేగా చేయమన్నది! ఆకొద్దికోరికలే యిన్ని అరస్టులెందుకు?——”

“ఆయనకూడ న్యాయంకోసం, దేశంకోసం పోరాడుతూన్నాడు కాబట్టె ఆ అరస్టులు.”

“ఓ!— అదా?—ఇప్పుడునీవు అపరగాంధీవికాబోతున్నావా ఈ ఆడంబరకోరికలతో—”

“అంతపేరుకు తగనివాడిని. ఆపేరు నామీదఉంచి అంతభార నాచేత మోయించకండి.”

“ఏమిటూ పెంకిమాటలు!— ఎవరితో మాట్లాడుతూన్నావో తెలుసా?——” అన్నాడు మేనేజరు. గోపాలసింగ్ ఆతనిమీద అధికారంచూపుతూ”

“ఆ. తెలుసు. మీకంటె అధికారిఅని తెలుసు. కూలివారికి అర్ధాకలితో అన్నంపెట్టే మహాధికారులని నాకు తెలియకపోవడమే!— తెలిసే— న్యాయంకోసం కండ్లుతెరువమని కోరుతూన్నారు. వచ్చిన

లాభాలను ఒక్కరేమిటి?, జీర్ణంచేసుకొనే దారుణఅమానుషప్రియ త్నాన్ని విడిచి తనకోసం రక్తమాంసములను కరిగించి, చెమటఊడ్చి దినమంతా పనిచేసే పనివాండ్రి కడుపుమంట చల్లార్చమని కోర డానికేవచ్చాను. ఎవరిశ్రమవల్ల యింతటి లాభాలు పొందుతూ అధిక సత్కారాలు అందుకొంటున్నారో, ఎవరికష్టంమీద యింతటి ఉన్నత స్థితిలో దేవేంద్రభోగాలు అందుకొంటూన్నారో ఆనోరులేని కూలీల కడుపులమీద తొక్కడంకంటే మరో దుష్కృత్యం ఉంటుందా?—ఏతల్లిపాలుతాగి పెరుగుతూన్నావో—ఆతల్లి స్తనములమీదనే కత్తి మొనమోపి అట్టహాసంతో, రాక్షసమనస్త్వంతో కసాయివాడిలా—"

"చాలు. నీవు నేర్చుకొని శ్రద్ధతో వల్లించిన లెక్చర్లను వినలేము. నీబూటకవ్రతాన్ని చాలించి తోవలోనికిరా—"

"మా విన్నపాల్ని ఆదరిస్తే అవతారం చాలించడమేకాదు, మిమ్ముల్ని భక్తితో పనివాళ్లమంతా కొలుస్తాం. మీవిశాలభావాల్ని పాటలమూలకంగా ప్రకటించానికి తెలిపి అధికలాభాలు అందుకొనే తక్కిన కంపెనీ ప్రొప్రయిటర్సుకు ఆదర్శంగా మీమార్గాన్ని అనుసరించమని—

"ఇక్కడఉండే తమరు తక్కిన కంపెనీలను స్ట్రయిక్ చేయిద్దామనా?—"

"కాదండి. వీరికి గాంధీమహాత్మునంత పేరు సంపాదించాలని ఉంది. యూరోపుకి స్వాతంత్ర్యం యిప్పించి యిప్పిస్తూంటే తక్కిన రాజ్యాలు ఆయనను స్వాతంత్ర్యరాజ్యస్థాపనకోసం ఆహ్వానించినట్టే తక్కినకంపెనీ లేబరర్సు వీరిని పిలిపించుకోవాలని వీరి పెద్దకోరిక. ఆఊహాలతో—"

"ఊ—అట్టి అందనికోరికలతో అపసవ్యంగా చలించి నాయకుడు అవస్థచూస్తే నాయకులకు పూర్వంజరిగిన శాస్తే కల్గుగుణముంధన్న

తెలుసుకోవాలి. నాయకత్వపట్టీలో తమపేరు చేర్చుకోడానికి ముందు కాంగ్రెస్ ప్రభుత్వం గతి ఏమయిందో తెలుసా—ఎంతమంది తమ దాయాదులకు దూరమై ఆరోగ్యము క్షీణింపచేసుకొని అకాలమరణానికి గురిఅయినారో తెలుసుకొన్నావా?— చెరశాల అనుభవానికి ముందు లాటీదెబ్బలతో వారిబుర్రలు ఎంతెంతటి బొప్పులు కట్టాయో తెలుసా?—

"తెలుసు. అవన్నీ తెలుసు. ఆత్యాగశీలుర జీవితాలకు నా తనువును అంకితంచేసేవారినీడనూ అనుసరిస్తూన్నాను. ఎవరిని హింసించి ప్రభుత్వమెప్పుకోసం అధికారపత్రాలను జారిచేయించారో, ఏచేతులతో లాటీలనుఎత్తి కఠినంగా బాధించి సంకెళ్లను తగిలించారో, ఆ అధికారవర్గం ఆచేతులతోనే ఆనాయకుల రైలుబోగీలదగ్గర కత్తులుపట్టి పారానుకాసిన సంఘటనలను మీారు జ్ఞప్తికి తెచ్చుకోవాలి—"

"ఆకాస్తభోగంకోసం ప్రతినిమిషంలోనూ తనువును ప్రమాదములలోనుంచి, మనసు పీకుతూఉన్నా, పట్టుదలకోసం, ఎదుటిప్రజలు ఎకసెక్కాలు చేస్తారన్న భయంతో జీవితాన్నంతా నరకమయం చేసుకోవడంలోనే సౌఖ్యముందంటావా?"

"ఆమాటలు వదలండి. ఆపెద్దవిషయములు యిప్పుడు చర్చించ అవసరంలేదు. ఇప్పుడు జరుగవలసినకర్తవ్యతనుగూర్చి మాట్లయివ్వమని ప్రార్థిస్తూఉన్నాను."

"నీవు వ్రాసిపంపిన నిబంధనలు అంగీకరించవలసిన దేనని కదూ నీవు వచ్చింది!—"

"న్యాయాన్ని గుర్తించి, నిజాన్ని గమనించి, వారికష్టానికి సరిపోయే కూలిని హెచ్చించమని కోరుతూన్నాము."

"అలా అంగీకరించవీలులేదని చెపుతూన్నాను. ఎంతకాలం అట్ట్రయిక్ చేసి వారికడుపులు కాల్చుకొంటారో చూస్తాను ఘుడీమధ్యి

జ్ఞానంతో తయారై నీవలె ముందునిలచి డబ్బాలుకొట్టే డబ్బారాయుళ్లు ఎంతకాలం ఈ స్ట్రైకును నిరాఘాటంగా జరిపిస్తారో చూస్తాను—''

"అర్థఆకలితో జీవితాలు జరుపుకొనేకంటే నిండుఉపవాసంతో నిరసనవ్రతంపూని ఎప్పటికైనా మీహృదయాన్ని కరిగించుకొన ప్రయత్నములో పూర్వమే నిమగ్నులమై యున్నాము.

"అంటే స్ట్రైక్‌ను కంటిన్యూ చేయించదలచావన్నమాట. అన్నాడు చందు ఉరుముతూ ఆతనివంకచూచి,

"తమకు అనుగ్రహం కలిగేవరకు అలానే జరుగుతుందని నా నమ్మిక. అప్పుడు మీకంపెనీస్థితి, మీస్థితికూడ ఏలా మారుతుందో యోచించుకోండి, కేవలం పట్టుదలకోసం బెట్టుగా కూర్చుంటే—''

"ఛీ!— వెధవా!—పనికిమాలిన పలుగా!—నాకు నీతులు చెప్ప వచ్చావురా బానిసకొడుకా!—' అంటూ 'చందూలాల్ పట్టలేని కోపంతో ప్రక్కబల్లమీది పూల చిన్నయిత్తడికుండెను బలంకొలది కృష్ణారావుమీదికి విసరాడు. ఆకుండె మెరుస్తూ విష్ణుచక్రంలా గిరని తిరుగుతూ 'టంగ్' మను శబ్దంతో ఆతని నుదురును చేదించి క్రింద ఆతని కాళ్లదగ్గరనే పడింది. తోడనే ఆతని నొసలునుండి ఎర్రని రక్తం చిల్లున ముందుకు చొరచుకొని పాతాళగంగలా ప్రవహిస్తూ ముక్కుమీదనుంచీ, ఎడమకన్ను ప్రక్కనుంచీ పిల్లకాలువలులా చీలిపోతూంది. అంతదెబ్బకు గురిఅయిన కృష్ణారావు ఆస్థలంనుంచి ఒక్క అడుగైననూ కదలక, పోతశిలావిగ్రహంలా అక్కడనే నిలచి, జారుతూన్న రుధిరాన్ని తుడుచుకొనకుండానే సినిమాలోని హీరోలా చందూ రామలాల్ వంక చూస్తూన్నాడు.

ఎర్రని రక్తం ముక్కుచివరనుంచీ, చెంపలమీదనుంచీ జారుతూ ఆతని సన్నచాల్లచొక్కాను తడుపుతూంది.

నిశ్చలంగా నిలువబడిన కృష్ణారావువంక చూస్తూన్నారు అక్కడివారంతా. అందరిగుండెలూ అనిశ్శబ్దంలో వేగంగా కొట్టుకొంటూనా యి. కృష్ణారావు చూచేకోపదృక్కులలోని కన్నీళ్లు, నీళ్లలో నిప్పులులా వెలుగుతూన్నాయి.

ఆతనిలోని అంతరానికి, త్యాగానికీ, కార్యదీక్షకీ మనసులో రహస్యంగా మెచ్చుకొంటూన్న బీనాకుమారి హృదయంలో అప్పటి ఆతనికి జరిగిన ప్రమాదం షాక్ యిచ్చినట్టయింది. ఆక్షణంలో ఆమెలో ఎన్నడూ ఎవరిపట్లకూడ కలుగని జాలీ, ఆదరణ, అనురాగం వరసగా ఆమెకు తెలియకుండానే పొంగి ఆతని గాయానికి కట్టుకట్టే తలపుతో కాబోలు చట్టున లేవబోయి, జేగుదేరిన తండ్రిముహం అగుపడడంచేత అసహాయస్థితిలో ఆకుర్చీలోనే చదికిలబడి నిస్పృహతో కండ్లుమూసింది.

'బహూకరించారు. సంతసం. పోని- యిప్పటికైనా కూలీల గోడువిని. వారికి సహాయంచేయమని ఆఖరుసారి కోరుతూన్నాను.'

'తమ ఆజ్ఞను అనుసరించే అధములు యిక్కడ ఎవరూలేరు.'

"ఐతే—యిహా వెళ్లవచ్చంటూరా?—" అన్నాడు కృష్ణారావు ఆతడు కొట్టాడన్న కోపమేలేకుండ.

"ఈమాటకూడవిని వెళ్లమంటూన్నాను."

"చెప్పండి. నాకండ్లు తిరుగుతూన్నాయి. కన్నులు పచ్చక్రమ్మి శరీరం స్వాధీనం తప్పుతూంది."

"ఇంకా స్ట్రయిక్ సాగిందంటే యినుపకటకటాలలో దిక్కులేకుండ ఊగిసలాడే అధమస్థితిలోనికి నిన్ను ఈడ్చి నాత్రోవకు అడ్డునిలువకుండ చేసుకొనగలను—"

"చెయ్యండి. నన్ను అరెస్టు చేయించిన శక్తులను పూర్తిగా మీరు కట్టకలిగినప్పుడుగాని నాప్రయత్నం నేను విడువను. నాసోదరులు నామాటమీదనే ఉంటారనే నమ్మకం నాకు ఉంది—"

అంటూ కృష్ణారావు మరి మాటలాడలేక, రక్తంతో బట్టలను తడిపే ఆపెద్దగాయముతో తూలుతూ చేరువకుర్చీలనూ, గోడను ఆధారంగా చేసుకొని తిరుగుమొహం పెట్టి నడచిపోతూన్నాడు.

ఆదృశ్యాన్ని చివరంటాచూస్తూన్న బీనాకుమారి తనగుండెతో అక్కడకూర్చుండలేక చట్టునలేచి తండ్రితో చెప్పకుండానే మేడ మెట్లు ఎక్కిపోయింది.

"మంచి శాస్తిజరిగింది. ఈదెబ్బతో లాల్‌గారి సంగతి అర్థం చేసుకొంటాడు." అన్నాడు మేనజరు సింగు మొహార్భాటీగా.

"ఆగాయాన్నిచూపి లేబరులో మరెంత అల్లరిని లేవతీస్తాడో! అన్నాడు రంగాప్రసాద్ సంశయంగా.

'ఊఁ! జరిగింది. వాడికి జరుగవలసిన ప్రాయశ్చిత్తం జరిగింది. ఇంకా ఈపనిలో పూర్తిగా పూనుకొన్నాడంటే యింకా అనుభవించే మార్గాలను వెతుకుతాను. వెతకడమేకాదు. వాడు మరల నాకండ్ల ఎదుట పడకుండ ఉండే పెద్దశిక్షను అందుకొంటాడు. తొందరలోనే' అన్నాడు చందూరామలాల్ కృష్ణారావును యోచిస్తూ నెమ్మదిగా తలపంకించి, ఆమాటలస్థాయిలోనూ, కండ్లకదలికలోనూ క్రూరత్వం కనబడుతూనే ఉంది. ఆమాటలతోనే ప్రొప్రయిటరు చందూరామలాల్ కండ్లలో యోచన అగుపడేలా ఎదుటకు శూన్యంలోనికిచూస్తు తనగదిలోనికి నడచాడు.

మేనేజరు గోపాల్‌సింగ్, రంగాప్రసాద్‌లు ఆతనినంకచూస్తూ ఆతనిని డిస్టర్బ్ చేయకుండా ప్రతిమల్లాగే నోటమాటలేకుండా కూర్చుండిపోయారు కుర్చీలలో.

---

# 2

కృష్ణారావు, కృష్ణాజిల్లా సర్నాపురం గ్రామకాపరస్తుడు—యింటరుమిడియట్ వరకు మాత్రమే చదివి రైల్వేమెయిలు సార్టర్‌గా తొంబ్బది రూపాయల వేతనంమీద పనిచేస్తూన్నాడు. ఆ ఉద్యోగము వచ్చిన కారణంచేతనే తనపెద్దచదువు మానుకొనవలసివచ్చింది కృష్ణారావు. ఆదినములలో కాంగ్రెస్ ప్రచారం విపరీతంగా ఉండడంచేత ఆవేశంతో కృష్ణారావు తనఉద్యోగానికి రాజీనామాయిచ్చి దేశసేవలోఉరకి తన ఆస్తినంతా బీదజనులసహాయంకోసం త్యాగం చేశాడు. చివరకు కర్షకజనుల కష్టాలను తిలకించి ఓర్చుకొనలేక వారికి మేలు చేయ కోరికతో టిటాగర్ సిమెంటు ఫాక్టరీలో ఒక పనివాడుగా ప్రవేశించి అలజడిని లేవదీశాడు.

కృష్ణారావు వయస్సు పాతికసంవత్సరాలకుమించి ఉండదు. శరీరచ్ఛాయ, ముహంపొందిక, వస్త్రధారణ ఆతనిలో దాగుకొనిఉన్న మేధాశక్తినీ ఉన్నతహృదయాన్ని ఎదుట ఓవ్యక్తికి మొదట చూపులోనే బాహాటంగా అగుపడి ఆకర్షించి తీరుతుంది.

టిటాగర్ సిమ్మెంటుఫాక్టరీ యజమాని చందూరామలాల్ సేట్. ఆఫాక్టరీలాభాలువల్లనే పెద్దవాడై ఆనగరంలో పెద్దసేట్‌అని పేరు గాంచాడు. ఆతడు తన ఫాక్టరీకూలీలకు తగ్గురేట్లుగల కూలీఏర్పాటు చేసి పనికాలం దినానికి పదిగంటలు నిర్ణయించాడు. విధిలేక ఆకర్షక జీవులు తమకష్టాన్నంతా ఆసేటులాభాలకు వినియోగిస్తూ తక్కువ ప్రతిఫలాన్నే అనుభవిస్తూండేవారు. వారిలో శేట్ చందూరామలాల్‌ను ఎదిరించి తమపనికాలాలను తగ్గించి, కూలీరేటు హెచ్చించుమని అడిగే గుండెగల మనిషి ఒక్కడూ లేకపోవడం చేతనే అప్పటివరకు శేట్ ఆటలు సాగవచ్చాయి.

ఆకష్టజీవుల కష్టాలిని తీర్చడానికే కృష్ణారావు ఆకంపెనీలో సాధారణ కూలివానిగా చేరి సమ్మెకట్టించి శేట్ కు అపరిమిత నష్టాన్ని కలుగచేశాడు.

బీనాకుమారి శేట్ చందూరాంనుంలాల్‌గారి ఏకైక ముద్దుబిడ్డ—ఆంగ్లవిద్యను అభ్యసిస్తూన్న విద్యావతి. ప్రాశ్చాత్య నాగరికతను అల వరించుకొని అపురూపంగా తన అందానికి వన్నెలు కూర్చుకోవడంలో నగంకాలాన్ని వెచ్చించే ఆధునిక సౌందర్యవతి ఆమె.

ధనిక కుటుంబానికిచెందిన బీనాకుమారి స్వభావం అంతా గంభీరంగా, నిగూఢంగాఉండి, ఎంత నిరంకుశంగా అగుపడుతుందో అంతమెత్తని వెన్నవంటి మనస్సుతో ఔదార్యబుద్ధి కలిగి ఉంటుంది.

ఇరువది సంవత్సరాల మధురమైన వయస్సు, సన్నని నడుమూ, ఎత్తునుంచి చక్కగా వంపులుదేరిన రొమ్ములుగల సోగైన రూపము కలిగి బీనాకుమారిఎదుటియావనహృదయాన్ని అమాంతంగా ఆకర్షించుకొనే అప్సరసలా అగుపడేది. ఆమెధరించే విలువగల వస్త్రదారుణలోని గొప్పతనం, ఆజాకెట్ల వంకరలలోని క్రొత్తదనం చూచిన కొద్దీ చూడాలనే అనిపిస్తుంది ఎదుట నూనసిక హృదయానికి.

ఆమె కాలేజీలో కూర్చొని పాఠాలు నేర్చుకొంటూన్నప్పుడు కూడ విద్యార్థుల దృష్టులను తనవైపు త్రిప్పుకొని లెక్చరుమీద వారి మనస్సులు నిలువకుండ చేసేది. క్రొత్తగావచ్చిన కుర్రలెక్చరర్లు కూడ అప్పుడప్పుడు ఏదో కారణాన్ని కల్పించుకొని కంఠంత్రిప్పి ఆమెవంక దేవతనుచూచేటట్టు చూస్తూ సగం లెక్చరులో చెపుతూన్న పాయింటును మరచి, అది జ్ఞప్తిలోనికి తెచ్చుకొనడానికి ఒకటి, రెండు నిమిషములు తబ్బిబ్బులు పడుతూ త్రోవలోనికి వచ్చినప్పటికి నీటిలో మునిగి తేరుకోలేనట్టు ఉక్కిరి బిక్కిరిఅయి అమాంతంగాఅపహాస్యానికి గురికూడ కావలసివచ్చే అంతటి అధమస్థితి ఏర్పడుతూండేది.

ఆమెకు కాలేజీలో చాటుపేర్లు, 'మిట్టర్ ప్లమ్' అనీ 'ఆన్ జిల్ క్వీన్' అనీ వివిధ అందమైన పేర్లతో తమాషాగా చెప్పుకొనేవారు.

కృష్ణారావు ఆపెద్దగాయంతో జ్వరంవల్ల బాధపడుతూ తనతో పనిచేసే కర్షక మిత్రుని యింటిలో మంచంమీదపడి ఉన్నాడు. ఆబీద మిత్రుడు రాజారావే ఆతనికి తోడ్పడి సహాయంచేస్తూన్నాడు. రాజారామ్ చెల్లెలు రుక్మిణిబాయికూడ అన్నచేసే సేవలో పాలును పంచుకొంటూ కృష్ణారావును కండ్లలో పెట్టుకొని కాపాడుతూంది. ఆమె వయస్సు పదహారు ఏండ్లు ఉండవచ్చు. ఛాయలో నలుపు అయినా చూడడానికి తీరుగానే అగుపిస్తుంది.

ఆదినం ఉదయం ఏడు అవుతుంది. రుక్మిణిబాయి వంటయింటిలో కృష్ణారావుకోసం కాఫీ చేస్తోంది. రాజారామ్ మాత్రం ఆతని పక్కనేకూర్చుని కంపెనీ విషయాలు చెప్తూన్నాడు.

'అన్నా! ఇదిగో కాఫీ, తీసుకో—'

'రుక్మిణీతల్లీ! నాకోసం రాత్రులనక పగలుఅనక కష్టపడుతూన్నావు. నీకష్టం ఏలా తీర్చుకొనగలనో తెలియకుండా ఉంది.'

'నీవు చేసే మానవసేవకోసంపడే కష్టాలకంటే ఎక్కువకష్టాన్ని నేను పడుతూన్నానంటారా! లేవండి. కాఫీ వేడిగాఉన్నప్పుడే త్రాగాలి.'

'లే—కృష్ణా! నిన్నటినుంచి ఆహారంలేని నీప్రాణానికి ఈకాఫీ కొంత ఉపశాంతి చేకూరుస్తుంది—'

అని రాజారామ్‌కూడా అంటూంటే, కృష్ణారావు మిత్రుని సహాయంతో లేచి కాఫీని పెదవులదగ్గరపెట్టుకొని త్రాగుతూఉన్నాడు.

'ఎంతదెబ్బకొట్టాడు ఆకలిన కసాయివాడు!—' అంది రుక్మిణిబాయి కట్టుకట్టబడిన ఆతని నుదురుమీద గాయంవంక చూస్తూ—

'ఎంతదెబ్బకొట్టినా కనికరించి ఆకర్షకజీవుల కష్టాల్ని గమనించి న్యాయహక్కులను వారికి యిస్తే సంతసించి ఉందును.'

'అంతటి ఉన్నత హృదయంగలవాడైతే యింతదెబ్బ నిన్ను కొట్టగలుగుతాడా ఆవశువు!—' అన్నాడు మిత్రుడు రాజారామ్.

'నానుదురుమీది రుధిరాన్ని చూచిఅయినా జాలిపడి మనవిన్న పాన్ని చెల్లిస్తారని ఆశపడి అరగడియకాలం అక్కడనే నిలచానుకూడ. కాని లాభంలేకపోయింది—'

'లాభంలేకపోతుందా? చూడ్డాంగా ఎందుకు లాభించదో!—'

'అంటే—'

'నీనుదురుమీది గాయంచూచిన తరువాత కూలివారి హృదయాలు కరిగి నీకు జరిగిన అఘాయిత్యాన్ని తలచుకొంటూ మరింత క్షోభించి కూర్చున్నారు. అప్పుడే ఆశేటు కొంపమీదపడి తిరుగబడ చూచారు. కాని నేనే ఆపాను వారి ఆవేశాన్ని.'

'మంచిపని చేశావ్. మనం తొందరపడితే పనులు సక్రమంగా నెరవేరవు. అసలు నాగాయాన్ని చూడ వారికి అవకాశం ఏలా చిక్కింది! ఇట్టివిపత్తు కలిగిన సమాచారం వారికి ఏలాఅంది ఉంటుంది!

'సమ్మె దినాల్లో కాళీగాఉన్న కూలివాళ్లకు ఈవార్త తెలియక పోతుందా! నీవు స్పృహలేకుండ జ్వరతీవ్రతతో కండ్లు మూసుకొని ప్రక్కమీదపడి వున్నప్పుడు డాక్టరువచ్చి నీనుదురుకు కట్టుకడుతూన్న వేళకు చాలమందిఫాక్టరిపనివాళ్లు యిక్కడనేఉన్నారు. జరిగిన సమాచారం అంతా మన రుక్మిణివల్ల తెలుసుకొని యిక్కడ కర్షకజనం గుంపులుగాకూడి శేట్ మీదకు దండెత్తబోయారు— నేనే వారిప్రయత్నాన్ని వారించి వెనుకకు పంపివేశాను.'

'సత్యం, నమ్మిక, సేవ కర్షకజీవుల పవిత్రజీవితాలలోనే ఇమిడివుంది. వారికే జయం చేకూరుతుందనే నానమ్మకం నాకు ఉంది— వారు యింకా ఒకటి, రెండు దినములు ఈస్ట్రయిక్ ను పూనికతో నిర్వహిస్తే, శేట్ పాదాక్రాంతుడు కాగలడని నేను ఎరుగుదును; అప్పుడే

కర్షకజీవుల కష్టాలు తొలగిపోయే దినం రాగలగని నాదృఢవిశ్వాసం అని కృష్ణారావు ఉత్సాహంతో అంటూంటే వీధిలో కారు ఆగిన చప్పుడయింది. ముగ్గురూ ద్వారంవంక చూస్తున్నారు.

శేట్ చందూ రామలాల్‌గారి కుమార్తె బీనాకుమారి ఆగది లోనికి చక్కని డెకరేషన్‌తో ప్రవేశించింది. రాజారామ్ రుక్మిణీ బాయిలు ఆమె రాకతో గౌరవంగా లేచినిలువ బడ్డారు. కాని—బల హీనతతో కృష్ణారావు మంచంమీదనుంచి కదలకుండానే—

"క్షమించండి. నేను నిలువలేని స్థితిలో ఉండడంచేత మీకు—

"అక్కర్లేదు. ఆమర్యాదలు తీసుకోడానికి రాలేదు నేను. ఇప్పుడు మీకు ఏలాఉంది!—" అంది కుమారిబీనా అతని చేరువకు నడుస్తూ అంతలో కుర్చీపీటను తుడచి ఆమంచంనకు చేరువగా వేసి ఆమెను కూర్చుండ మని ఆహ్వానించారు రాజారామ్ రుక్మిణీ బాయిలు.

కుమారి ఆ ఎత్తుపీట మీద సున్నితంగా కూర్చుంది.

"ప్రస్తుతం కులాసాగానే ఉంది."

"మీరు ఆంధ్రులా!—"

"ఆ. అవును."

"మీరు సాధారణ కూలిగా పనిచేస్తూనా, రా ఫాక్టరీలో!—

"అవును."

"చదువు కొన్న సూచనలు అగుపడే మీరు కూలివారుగా ప్రవేశించ కారణం ఏమికలిగింది!—"

'ఆకష్ట జీవుల కష్టాలలో పాలును పంచుకొనకోరిక గలిగి.'

"మీరు ఏమి చదువుకొన్నారు!—"

'ఇంటరు మిడియట్ పూర్తిచేసి చదువు మానుకొన్నాను.'

'మానడానికి కారణం ఏమొచ్చింది!—'

'ఏదో అప్పటి ఆవేశంతో మానివేశాను.'

'మీరు కాంగ్రెస్‌కుగాని, మరొకపార్టీకిగాని చెందినవారా_?'

"కాదు. అవన్నీ వదలుకొన్నాను. ఆపేరులు తగిలించుకొని ప్రపంచాన్ని మోసముచేసే ముఠాసరుకునుంచి తప్పించుకొని ఈవల పడ్డాను. దేశసేవ అనిచెప్పే తంత్రకారుల అభిమతం అర్థం చేసుకొని కేవలం పరమార్థికంకోసం పాటుపడాలనే నిశ్చయంలోనికి వచ్చి, ఒకరి కట్టుబాట్లతోగాని, సలహాలతోగాని నిమిత్తంలేకుండ నాబుద్ధికి నచ్చిన రీతి కర్షక జీవుల కష్టాల్ని తొలిగించాలనే నమ్మకంతో కంకణంకట్టుకొని ఈకార్యరంగంలోనికి దూకేను.'

'పనిలోకూడ కష్టాలను కౌగలించుకోవలసిన అవసరం వస్తుందని మ్ముందుగానే విచారించేదిగారా మీరీకార్యరంగంలో!— ధనవంతుల కోపదృష్టిముందు ఎంతవరకు ఆగ గలరో అర్థంచేసుకొనే ఈపనిలో ముందంజ వేస్తూన్నారా మీరు!—'

'మళ్ళీ ఆమాటలతో భయపెట్టవచ్చారా మీరు!—క్షమించండి. ఆమాటలు మాటాడ కండి. అవన్నీ పూర్వమే.మీకంటెబాగుగనే అర్థంచేసుకొనేదిగాను ధనవంతుల రాక్షసకృత్యాలను అడ్డుతగలడానికి—'

'మీరు ఒక్కరు ఈఫాక్టరీ కర్షకుల తరఫున పోరాడి చివరకు జయాన్ని పొందుతే మాత్రం ఏంప్రయోజనముంటుంది!—ఎన్ని పట్టణాలలో ఎన్ని ఫాక్టరీలను సంస్కరించగలరు మీరు!—మీవంటి స్వార్థత్యాగులు కొన్ని వేలునిలచి నప్పుడుగదా ఆసంస్కారం చెందకలుగడం!—'

'నిజమే. నావలె అనేమంది ఈశతాబ్దంలో నిలచి పనిచేస్తారనే నమ్మకం నాకుఉంది. నావంటివారు ఎంత మందో కావాలని నిరుత్సాహపడి నేను చేయ గల్గేకొద్ది ఉపకారాన్ని కూడ చేయకుండ చేతులు కడుగు కొంటే ఎవరిమట్టుకు, వారు మాత్రం ఆమాట అనుకొని నిరాశతో—'

"మీరు ఇంకా ఈస్ట్రయిక్ పట్టుదలగా సాగించదలచారా?—'

'పట్టుదల ఏముంది!— న్యాయాన్ని తెలుసుకొని తోడిమానవ జాతికి సహాయంచేయ వలసినదిగా సందేశం మాత్రమే యిది.—'

'ఎంత చాకచక్యంగా మాటాడగలరండీ మీరు!— మీపట్టుదలకూ, మీగాంభీర భావాలకూ మెచ్చుకొనే మిమ్ములను చూచి పోదామని వచ్చాను.—'

'మీ అనుగ్రహానికి అనేక వందనాలు.'

'మీకు జ్వరంగా కూడా ఉందా?—'

'ఈదినం కొంచెం తగ్గిన సూచనలు అగుపడుతూన్నాయి.'

'మీకు మాయింటిలో జరిగిన అమానుష కృత్యానికి నాకే కష్టం అనిపించింది. కాని ఆస్థితిలో ఏమీ చేయలేక ఊరుకొన్నాను—'

'మీకు చేయగలుగుతే మీకూలీలకు తగుసహాయంచేసి వారి హక్కులను వారికి అందచేసే ఏర్పాటుచేయించండి.—'

'ఈస్థితిలో మీకు సంతోషాన్ని కూర్చడానికే ఈరహస్యాన్ని చెపుతూవున్నాను నేను.— అని అంటూ బీనా నాలుగు దిక్కులు పరికిస్తూ ఉంటే కృష్ణుడు ఆమె కండ్లలోనికి ఆతృతగా చూస్తూ—

'చెప్పండి. వీరు మనవారే మీరు భయపడవలసిన పనిలేదు.—'

'ఈమాటపైకి వెళకూడదని నాకోరిక.—'

'అలా జరుగదు. మా సంతోషంకోసం చెప్పే మాటను మేము వెల్లడి పరుస్తామా?—'

'రేపు కూడస్ట్రయిక్ కంటిన్యూ అయితే ఎల్లుండి మిమ్ములను రావించి మీకన్సంటు మీద కొన్ని షరతులను కొద్దిగా మార్చి వప్పుకొన చూస్తూన్నారు మానాన్నగారు. వారిమాటలువినే యిలామీస్థితి తెలుసుకోడానికి వచ్చాను.—'

'షరతులు మార్చడం ఎలావీలుపడుతుంది! —'

'పిలుకాక పోతే ఆపరతులనే అంగీకరించి పనివాళ్లను పనిలో పెట్టుకొన చూస్తూన్నారు మానాన్నగారు—' అని బీనాకుమారిచెప్పి ఊరుకొంది.

కృతజ్ఞతతో అక్కడివారి ముగ్గురికండ్లు యామెవంక విశ్వాసంగా స్తూన్నాయి.

'ఇప్పుడు ట్రీటు, మెంటు ఎవరు చేస్తూన్నట్టు!—'

'మ్యున్సు ఫల్ డాక్టరుగారండి!—'

'జ్వరంతగ్గిందా?—' అంటూ యామె తపచల్లని హిమవంతం లాంటి చేతిని యాతని శరీరంమీద ఉంచింది. యామెత్తని స్పర్శకు యాతని శరీరం అంతా పులకరించింది. యాస్పర్సలో యామెసన్నని మెత్తని తెల్లచేతిలో బిగుసుకొన్న వెచ్చని నరాలుపడే తహతహ యాతని జబ్బమీది నరాలకు స్పష్టంగా తడుతూనే ఉంది.—'

యాతనిలోని రక్తంవేడెక్కి పరవళ్లు త్రొక్కుతోంది. త్యాగ పరివర్తనతో ఆతనిలోనుంచి ఎన్నడోపోయిన ఆకర్షణలన్నీ ఆతనికి మరల జ్ఞప్తికితెచ్చి మేలుకొల్పుతూన్నాయి. కండ్లను భ్రమింపజేసే ఆమె సౌందర్యానికి ఆతని కండ్లు చూసినకొద్దీ చూడాలనేవాంఛతో ఆతని స్వాధీనంనుంచి తప్పించుకొని చెడుగుడును ఆడుతూన్నాయి.

మోహాపూరితమైన యాతనికండ్లుపుష్పంవంటి యామె కోమలమైన ముఖంపైన వ్రేలాడుతూండగనే యాతని శరీరంనుంచి తనచేతిని తీసికొని.—'

'జ్వరం యింకాతీవ్రంగానే ఉంది.' అంది కుమారిబీనా.

'అవునుతల్లీ. నిన్నటినుంచి యాహారమేపెట్టి ఉండలేదు యాయనకు. ఇప్పుడే యాకాస్త కాఫీని త్రాగుతున్నారు.—'

'పాపంనామూలంగా యాకాఫీని కూడ సగంలో త్రాగడంలో మానుకొన్నారు—'

'అహ!— లేద డి మీరాకతో—మీమాటలతో నాకు భోజనం చేసినట్టే ని డుగాడు ది. మీరు రోజూ ఓమారు యిలావచ్చిచూచి పోతూంటే నాకుజబ్బుతిరుగు ముఖం పెడుతు దని యాశిస్తూన్నాను— అని కృష్ణారావు యామెవన క చూచి అంటూంటే యామని చూపు లను అర్థ చేసుగున్న బీనాచూపులకు చూపులు సమాధానం యిచ్చి రుక్మిణి బాయినిచూస్తూ—'

'ఇదిగో—ఈపాతిక రూపాయలు మీదగ్గర ఉ చుకొని పెద్ద డాక్టరుచేత ట్రీటుమె టు చేయి చ డి అవసరమైతే యి కాడబ్బు మీ కు నేను యిస్తాను- 'అ టూ ఐదు రూపాయలకాగితాలు ఐదుతీసి యామెకు అ దించి ది.

'అ తడబ్బుతో అవసరం ఉండదను కొ టాను' అన్నాడు కృష్ణారావు.

'ఫరవాలేదు. ఎక్కువడబ్బు ఉండడంవల్ల నష్టం ఏముందిఉంచ నివ్వండి—' అంటూ చేతి తోలుసంచిని మూసివేసింది.

డబ్బు తీయడానికి చేతిలోని తోలుసంచి అరలను ఆమెతల వంచుకొని చూస్తూంటే ఆతనికండ్ల ఎదుట ఆమె గట్టిరొమ్ములు ఆవే శంతో లేచి పడుతూండడం ఆశగా చూస్తున్నాడు కృష్ణారావు.

ఆపమిట తెరలోనుంచి, పమిటలేనట్లే అవక్షంలో కదులుతున్న ఆగుండ్రని అందమైన వంపులు ఆతనికి స్పష్టంగా గోచరిస్తూ పరవశ పరుస్తూన్నాయి.

ఆమెకూడ తన అందాన్ని ఆతడు చూస్తూనట్టు తనకు తెలి యనట్టే ఆతడ్ని చూడనిస్తూ, ఆతడుచూస్తూన్న సంగతి యామె చూస్తూ పరవశంగా, మధురఊహలతో ఊగిసలాడుతూ ఊరుకొంది.

"రేపటిదినం వస్తారుకదూ!' అనాడు కృష్ణుడు చిన్నపిల్లాడిలా యామెవంక చూస్తూ.

'ఆ. కాలేజీ విడచిన తరువాత సాయంత్రంవేళవచ్చి చూచి వెళతాను.' అని యాతనివంకకు వంగి అంటూన్నప్పుడు యామె తెల్లని పలువరస అంచంలోనుంచి కస్తూరిపరిమిళాలు అతనిలో క్రొత్త ప్రాణాన్ని లేవదీసింది.

'వెడుతూన్నారా? రేపు తప్పక వస్తారుకదూ—' అని రుక్మిణీ బాయి అంటూంటే కుమారి బీనా యామెవంక చూడకుండానే తన చక్కని పెద్దనల్లని సోగకండ్లతో నొక్కులుదేరిన కృష్ణారావు తల వంకా, పెద్దవిగా తెరచుకొని యాశగా వెలుగుతూ చూచే యాతని కండ్లవంకా ఊరకే పిచ్చిగా చూస్తూ—

"వస్తాను. విధిగావచ్చి వెడతాను. జాగ్రత్తగా చూస్తూండండి. అంటూ కణ్వ యాశ్రమంలో కలుసుకొన్న దుష్యంతునునుంచి సిగ్గుతో తప్పుకొనే శకుంతలా తర్లిపోయింది. యాగదిలోనుంచి బీనాకుమారి.

ఆమె పల్చని పెదవులు, పాలవలె మెరసే పలువరస నవ్వు కృష్ణారావు జ్ఞప్తికి తెచ్చుకొంటూ కండ్లు మూశాడు.

---

# 3

'నన్ను రమ్మని ఉత్తరం వ్రాశారా!—'

"ఆ. అవును. మీఅవసరంవచ్చే రహస్యంగా మీకు ఉత్తరము వ్రాశాను.

"ఏమిటా అవసరం!"

"మాార్కెట్ కుమార్తె బీనాను ఎరుగుదువు కదూ ఖాన్!"

"ఎరుగకేం! సన్నంగా చలాకీగా చిన్నకారును స్వంతంగా డ్రైవు చేసుకొనివెళ్లే పిల్లకదూ!—

"ఊ— ఆమెనే ఎరుగుదువు కదూ!"

"ఇప్పుడు ఆమెకు ఏమి జరిగింది!—"

"ఆమెకు ఏమీ జరుగలేదు. నాకే జరుగుతుంది హాని అంతా. అందుకోసమే నీసహాయం కాంక్షించి పిలపించాను.

"ఆసహాయం ఎట్టిదో విఫలంగా చెప్పండి నాకు."

"ఆపనిలో తప్పక సహాయపడతానని ప్రమాణంచేసినగాని చెప్పలేను."

"సింగుగారూ! నావాగ్దానమే ప్రమాణం అనుకోండి. నేను మాటయిచ్చానా ఆపని జరిగి తీరవల్సిందే. చెప్పండి. నావల్లనైన. సహాయం తప్పక నేను చేస్తానని మాటయిస్తూ ఉన్నాను.

"బీనాకుమారిని నేను మొదటినుంచి ప్రేమిస్తూన్నాను. ఆమె అనురాగాన్ని నావంక త్రిప్పుకోడానికే మొదటినుంచీ నాప్రయత్నమంతా. ఆమె వప్పుకొండా అంటే నాతో ఆమెపెండ్లికి చందూ రామలాల్ అడ్డుపెట్టడు. ఆమె యిష్టతను అనుసరించే ఆమె పెండ్లి ఖాయము చేయాలని తండ్రియోచిస్తూన్నాడు—"

'ఆమె పెండ్లి మీతో జరుగడానికి నేను ఏలా సహాయపడ గలను—'

'దానికి అంతా మార్గముంది. ఇప్పుడే బీనా ఒక ఆంధ్రాటీచరు కృష్ణారావు వలలో చిక్కుఉంది. వాడు ఒకసాధారణకూలిగా మా ఫాక్టరిలో పనిచేసి స్ట్రయిక్‌ను లేవదీసి పూనికతో వారికి హక్కులను యిప్పించాడు. అప్పటినుంచే కర్షకపరిజలతోపాటు బీనా అభిమానం కూడ ఆతనికి చిక్కింది. అప్పటినుంచి బీనా ఆతనితోనే తిరుగుతూ ఆతనిని క్షణక్షణం చూడకుండ నిల్వలేక పోతూంది—

'యుక్తిచేసి ఆమెను చేజిక్కించుకొన్నాడన్న మాట—ఇప్పుడు తిరుగ పనిలోనికి వస్తూన్నాడా?'

"లేదు. కర్షకుల కష్టాలిని తీర్చడానికే అప్పటికి ఆతనిలోచేరి నట్లు ప్రవంచానికి తన ధీరత్వాన్ని చాటుతూ కూలినౌఖరీ మాను కొన్నాడు."

"మరెక్కడైనా ఉద్యోగానికి కుదిరినాడా?"

'ఉద్యోగం అవసరం వాడికేమిఉంది! ఆబీనా ఉందిగా కావల సిన పైకం అందచేయడానికి. ఆతని నుదురుమీద దెబ్బకు ఆమెయే టోప్రటుమెంటు చేయిస్తుందనికూడ తెలుస్తుంది.'

"ఈసందర్భంలో నాఅవసరం ఏముంటుంది!—"

"ఇంకనూ గ్రహించనేలేదా? చూడు— ఆ ఆంధ్రుడ్ని నా తోవల్లోనుంచి తొలిగించాలిఅంటే నీపిస్తలుగురికి ఆతడు గురికావాలి.

"కూనీ చేయాలంటారా?"

"అవును. అందుకోసం వేయి రూపాయలు బహుమానముగా యివ్వదలచాను. ఒక్కనిమిషం పని."

"పిచ్చివాడా! ఎందుకు నీకాభయం. చస్తే ఆశేట్ తన కుమార్తెను ఆంధ్రునికిచ్చి పెండ్లిచేయడు."

"నీకు తెలియదు. ఆమె పట్టుదలగా కోరిందంటే ఆమెమాటకు ఎదురు చెప్పలేడు చందూ. కాబట్టి వాడిని తుదముట్టించడమే ఇప్పటిలో జరుగవలసిన పని."

"ఆవ్యక్తిని నేను ఎరుగనుగా మరి."

"నేను దగ్గరఉండి ఈరాత్రికి చూపుతాను. నీవు గురి చూచి ఆపని చేసివేయాలి."

"తక్కిన మాటలు నాకు చెప్పనవసరంలేదు. నాచేతిలోని పిస్తలు గురి తప్పదు. కానీ— సామ్ముమాట!'

"ఆపని జరిగిన మరుక్షణంలోనే సొమ్మును నీకు అందచేస్తాను. ఆవిషయంలో నీవు నన్ను నమ్మలేవా?"

"సరే- ఈసాయంత్రం ఏడుగంటలకే ఆతడు ఉండే తావుకు వెళ్లి మాటువేసి, వాడి ఉనికిని తెలుసుకొని 'డాం' మనిపిస్తాను—'

'సాయంత్రం మీయింటికి ఎన్నిగంటలకు రమ్మంటారు!'

'ఏడుగంటలకే వేగంరండి.' అంటూ ఖాన్ తన ఎర్రనికండ్లను ఆతనివంకకు త్రిప్పి క్రూరంగా చూస్తూ—

"అడ్వాన్సు ఒక పందరూపాయలను యివ్వండి." అన్నాడు గరానాగా.

"ఇదిగో ప్రస్థుతం ఈయాబదిరూపాయలు పుచ్చుకొండి. ఈ అడ్వాన్సుతో నిమిత్తం లేకుండానే వేయిరూపాయలు మీకు అంద చేస్తాను—' అంటూ మేనేజరు గోపాలసింగ్ ఆతని చేతిలో అయిదు పదిరూపాయిల కాగితాలు ఉంచాడు. ఖాన్ ఆకాగితాలను మడచ కుండానే తన బలమైన వ్రేళ్లతో నులిమి లెక్కలేనట్లు జేబులో ఇముడ్చుకొంటూ అక్కడనుంచి కదలిపోయాడు.



బీనాకుమారి చెప్పిన మాటలపైన కృష్ణారావు స్ట్రయిక్‌ను మరింత తీవ్రంగా ఆర్గనైజు చేయించి బీదకూలీల పనికాలము తగ్గింపుతోపాటు దినకూలినికూడ యిరువది పైసలంటు చొప్పున హెచ్చుచేయించాడు. ఆదినంనుంచి కృష్ణారావును తమకష్టాలను తొలగించ వచ్చిన అవతారపురుషుడనేనమ్మకం ప్రతిబీదకూలివాని హృదయంలో నాటిపోయి, ఆతనిపట్ల అధికగౌరవాన్ని చూపుతూండేవారు.

నుదురుమీది గాయంవల్ల చేసిన జబ్బులో బలహీన పడిన కృష్ణారావు బీనాకుమారి తీసుకొన్న శ్రద్ధవల్లనే ఆరోగ్యవంతుడయ్యాడు.

ఆమె ప్రతిదినం వచ్చిపోతూండడంలో ఆతని తలపులన్నీ ఆమె మీదనే పెట్టుకొని కృష్ణారావు ఆమె రాకకోసమే ఎదురుచూస్తూండే వాడు. ఆమె నిగారింపులోని కొత్తమెరుగు, ఆనునుపు, ఆనింపు ఆతని కండ్లని మంత్రించి కట్టివేసినట్టయి ఆమె రహస్య ప్రదేశాల మీదనే ఆతనిదృష్టి తారలాడుతూ ఉండేది. ఆతని చూపులోని తీవ్రత ఆప్రదేశాలమీద ఆమెకు చురుకును సూచించేది. కాని— ఆమెసిగ్గుతో ఆచురుకును అణచుకొనేది.

ఆతని కండ్లు వేటిమీద ఆనందిస్తూన్నాయో ఆమె గ్రహించి కూడ గ్రహించనట్టే ఆతని ముందు నవ్వుతూ తలదించుకొని మన్మథ బాణాలు లాంటి తన చూపులతో ఆతనిలోని పునాదులు కదలించి వేసాది.

ఆగూఢార్థపు మాటలతోనూ, చేష్టలతోనూ క్రమేణా కృష్ణా రావుకు వింత ఆశనుకూరుస్తూ ఆతనితో చనువు యిచ్చి మాట్లాడు తూండేది. ఆమాటల చనువే క్రమంగా ప్రేమగామారి వేరుకాబడిన హృదయమాధుర్యతను పొందుతూ చరిస్తూన్నారు.

వారి ప్రేమఘట్టాలతో కూడిన పరిచయాలనుఅర్థంచేసుకొన్న సింగ్ కి ఆ సమాచారం ఆతనిలో ఆరని ఆవేదన కలిగించి కృష్ణారావు తుదను ముట్టించడానికే నిశ్చయించుకొన్నాడు.

ఒక్కసారి గొప్పగా ప్రేమించిన స్త్రీ ఇంకొకరి మోహాధీనంలో చూడగనే ఎంతటి వానికైనా 'జలసీ' తలఎత్తక మానదనే అంశం అందరకు తెలిసినదేగా!—

ఆ దినం సాయంత్రం ఐదుకావస్తూంది. సూర్యుడు అప్పుడే తన వెచ్చని ఆఖరు బంగారు ముద్దులను భూమికి అందచేసి పడమర గ్రుంకుతూఉన్నాడు.

బీనా రాకకోసం ప్రతినిమిషాన్ని లెక్కిస్తూ ఎదురుచూస్తూ యున్న కృష్ణారావు ఆదినం ఆమె ఆలస్యానికి సహించుకోలేక గదిలో స్పీడుగా పచారులు సాగిస్తూ ఉన్నాడు.

అంతలో వీధిలో కారు ఆగిన శబ్దమైంది. అతని ప్రాణంలేచి వచ్చినట్టయి తొందరగా ద్వారందగ్గరకు నడిచాడు. బీనా చిన్న నవ్వుతో హంసలానడుస్తూ లోన ప్రవేశించింది.

'ఇప్పుడా రావడం!—'

'అదేమిటి!—జీతంయిచ్చి పెట్టుకొన్న నౌఖరీని అడుగుతూన్నట్టు అడుగుతూన్నారు.'

'పోనీ—ఎజమానులను అడిగినట్లే అడుగుతాను. ఇప్పుడు దయ చేశారేం!—అన్నాడు దొంగనవ్వుతో.

'ఇప్పుడేగా కాలేజీ విడచింది!—కాలేజీలో మీాటింగుకు కూడ ఈదినం హాజరుకాకుండ తిరిగివచ్చాశాను. మీాపరిచయం కలిగినప్పటి నుంచీ కాలేజీలో అబద్దాలుచెప్పి సెలవులు తీసుకోవడం యింటిలో ఆలస్యానికి అబద్ధాలు చెప్పడం ఈమధ్య అలవాటు పడుతూన్నాను.'

ఎవరికీ హానికలుగ చేయని అబద్దాలకే యింతగొప్పగా చెప్పుకొంటే, నిమిషాల్ని లెక్కపెట్టుకొంటూ నీకోసం నీఆబ్సెన్సులో పడే యమబాధ నేను ఎంతని చెప్పుకోవడం!—'

'ఎప్పుడూ యివే మాటలుమీారు—'

'ఇందాకటినుంచి నేను ఏకాంతంగా ఉండి పడేబాధను కాబోలు తిలకించి నన్ను ఎక్కిరిస్తూన్నట్టుగా ఆమొగ్గలు మొహాలు ఎత్తి నవ్వుతూండేది. ఇప్పుడు నీరాకతో సిగ్గుపడి తలలు వంచుకొంటూన్నాయి.—''

"మన సంగతి యిక్కడ చెట్లకీ గోడలకీ కూడ పూర్తిగా అర్థమై ఉంటుంది. ఇహాలేవండి. అలాకొ్రొత్త ప్రదేశాలకు కారులో దూరంగా పోయివద్దాం—''

"ఆగాలికి మరల జ్వరంతిరుగ వేస్తుందేమో!''

"నాప్రక్కనేగా మీరు కూర్చుండేది. యిహచలి ఏలా వేస్తుంది! అంటూ కిలకిల నవ్వుతూ అతని చేతిని పట్టుకొని కారువైపు ఈడ్చుకొని పోయింది.

"ఆగు. ఆతలుపు గొళ్ళెమైనా పెట్టనియ్యి—" అంటూ కృష్ణుడు తలుపు గొళ్ళెమును తగిలించి ఆమె ప్రక్కనే ఫ్రెంటుసీటులో కూర్చున్నాడు.

తోడనే కారుస్టార్టుచేసి ఒక్క జర్కుతో అక్కడనుంచి పోనిచ్చింది బీనాకుమారి. ఆజర్కును ఆనుకొను నెపంతో తృల్లిపడినట్లు నటించి కృష్ణుడు ఆమెబుజాలను పట్టుకొన్నాడు, ఆమె కిలకిల నవ్వుతూ ఆ ఎదురుగాలిలో కారును స్పీడులో పోనిస్తూంది. వెనుక రేగిన రోడ్డు మట్టిలో మఱి కారు కనబడనేలేదు.

సాయంత్రం ఏడుకావస్తూంది. ఆకాశమంతా కారుమబ్బులు ఏర్పడి ప్రకృతినంతా అంధకారంతో కప్పివేస్తూంది.

కృష్ణారావుకి ఆశ్రియమిచ్చిన రాజారామ్ కర్షకజీవుడు అవడం చేత తన చెల్లెలు రుక్మిణీబాయితోకూడ ఫాక్టరీలో కూలిపని చేయుటకు వెళ్లాడు. ఐదుదాటిన తరువాత ఫాక్టరినుంచి తిరిగివస్తూ, ఎప్పటివలెనే రుక్మిణిని యింటికివెళ్లమని, దినభత్యమును బజారులో కొనుక్కొనుటకు రాజారామ్ వేరుదారిని బజారుమార్గం పట్టాడు.

రుక్మిణీబాయి యిల్లుచేరినప్పటికే అంధకారం నాలుగుమూలలా అలుముకొని ఉంది. ఆమె తలుపుగొళ్లెమునుతీసి మామూలుగా అగ్గిపెట్టెతో దీపందగ్గరగా నిలచి మొదటిపుల్ల వెలిగించింది. ఆపుల్ల 'ఫర్'న వెలిగి దీపమునకు అంటించకుండానే ఆరిపోయింది. మరల రెండవపుల్ల జాగ్రత్తగా వెలిగించ ప్రియత్నములో :ఉండగనే ప్రక్కకిటికిలోనుంచి "ఢాం" మని రివాల్వరు పేలిన శబ్దమైయింది. తోడనే రుక్మిణీబాయి 'హా హా' కారములతో కెవ్వని కేకవేసి నేలమీదకు

వారగిపోయింది. తోడనే ప్రక్కకిటికీక్రిందగా దాగివున్న యిద్దరు వ్యక్తులు రోడ్డువైపు పరుగెత్తారు. దానిలోఒకడు పరుగెత్తలేక భీతితో చేరువనే నిలచిఉన్న టాంగా బండిలోదూరి దాకొన్నాడు.

అంతలోనే రాజారామ్ యింటిముందు చిన్నకారు ఆగడం, కృష్ణుడు దానినుంచి దిగడంతోడనే, కారువెళ్లిపోవడం జరిగింది.

కృష్ణుడు మామూలగావెళ్లి అగ్గిపెట్టెఉండే స్థలంలో చేయిపెట్టి వెదుకుతూన్నాడు. టాంగాలో దాగినవాడు తొందరగావచ్చి ఆఇంటి తలుపునులాగి గొళ్లెంవేసి, పరుగుతోవచ్చి టాంగాలో తిరుగ కూర్చు న్నాడు. అప్పుడేవచ్చిన టాంగాసాహేబ్—

"కోన్!—" అని ప్రశ్నించాడు.

"అరేయి! పోనియ్యి—" అన్నాడు కంఠంలో దగ్ధస్వరానిని అణచుకొంటూ.

"ఎక్కడికి పోవాలి!—"

"ముందుపోనియ్యి— తరువాత చెప్తాను." అన్నాడు. అతని కంగారు గమనిస్తూన్న సాహేబునోటిలో సగంకాలిన బీడీని పారవేసి,

"బండిప్రక్కలైట్లు ఆరిపోయాయి. అగ్గిపెట్టె ఉందాండిసార్!"

"నాదగ్గరలేదు. బజారులో బండిఆపి దుకాణందగ్గర వెలిగించు కొనవచ్చునులే—" అని బండిలోని ఆసామీ తొందరచేయగా ఆసా హేబు యాబండిని పెద్దచప్పుడుతో పోనిచ్చాడు.

ఆతని మనోవేగముతోసరిగా బండిపోకుండనందుకు బండిలోని వ్యక్తి చాల చిరాకును అభినయిస్తూ ఉన్నాడు.

'బండి ఎక్కడికి పోవాలిసార్!—'

"అబ్దుల్ ఆలీ సాహేబుగారి యింటి ఎదుటి యింటికి.

"ఓ! తమరా! సింగుగారా!"

"ఆ. నేనే. పోనియ్యి"

"తమయిల్లు నేను ఎరుగనిదేం!—" అంటూ సాహేబు బండిని వేగంగా పోనిస్తూ, ఒక అంగడిముందు బండిఆపి దీపాల్ని వెలిగించు కొన్నాడు.

మరియొక ఐదునిమిషములలో ఆబండి గోపాల్‌సింగు యింటి ముందు ఆగింది. సింగు గూబబండినుంచిదిగి ఐదురూపాయలు కాగితము తీసి సాహేబు చేతిలో ఉంచాడు.

"నాదగ్గర చిల్లరలేదండి సార్!— ఇప్పుడే బండికట్టుకోని వచ్చాను."

"చిల్లర అక్కర్లేదు. తీసుకో—" అంటూ అక్కడ నిలువ కుండానే సింగు లోనికిపోయాడు. బండివాడు అర్థం కానట్లు ఆతని వంక ఓనిమిషంచూచి ఆయన తలుపు వేసుకోవడంతోనే బండిని అధి రోహించి తోలుకొని పోయాడు.

---

# 4

ఖూనీ సమాచారం ఎక్కడనుంచో ఫోనుద్వారా పోలీసు వారికి తెలుపబడింది. తోడనే యిన్సుపెక్టరు తన పోలీసు భటుల పరివారంతో లారీలో రాజారామ్ యింటికి చేరుకొని వేయబడిన గొళ్ళాన్ని తీసి లోనప్రవేశించారు.

గదంతా అంధకారం. పోలీసు అధికారి చేతిలోని బాటరీలైటు వెలిగింపబడి నాలుగు మూలలా వెతకబడుతూంది. వెనుకనుంచి మరి రెండు, మూడు టార్చిలైట్లు ఒకేసారి వెలిగింప బడ్డాయి.

పోలీసు ఆగమనంతో శవం సమీపంలో లేచి నిలువబడిన కృష్ణుని మీద అన్ని లైట్ల వెలుతురు ఒక్కమారు పడింది. నిశ్చేష్టుడై నిలచిన ఆతని ముహం ఆవెలుగులో అగుపించింది. చేతులనిండ ఎర్రని రక్తంఅగుపడుతూనే ఉంది.

"ఎవరు నీవు? "

"ఈయింటనే నివాసం ఏర్పరచుకొన్న దురదృష్ట జీవిని."

"నీచేహత్య కాబడిన ఆస్త్రీ నీకు ఏమౌతుంది!–"

'నేను చెల్లెలుగా మాత్రం చూచుకొంటూంటాను ఈమెను. ఈమె నామిత్రుడు రాజారామ్ చెల్లెలు. రుక్మిణీ బాయితల్లి–'

"నీవు ఈమెను బలవంతం చేయడంలో యీమె వప్పుకొనలేద నేకదూహత్యచేశావ్!–'

"రామ!–రామ!–అలాని ఎవరు చెప్పారు?–'

"ఏమో–ఎక్కడినుంచో ఈకారణంవల్ల ఈగదిలో హత్యకాబడిందని ఫోనువచ్చింది. అందు చేతనే యీవార్త అందుకొనే యిక్కడకు రాగలిగాం."

అదంతా దొంగవార్త. నేను ఈగదిలో ప్రవేశించి అగ్గిపెట్టె కోసం వెతకుతూంటే బయట గొళ్ళెం నాకు తెలియకుండానే వేయబడింది. తరువాత ఈమె శవం నాకాలుకి తగలడంచేత ఈమె నిద్రిస్తూం దేమోనని లేపాను. కాని–యీమెలేవని కారణంచేత అనుమానంతో యీమె శరీరమంతా యీనవాలుకోసం వెతకాను. తరువాత రుక్మిణిబాయి అని తెలుసుకొని గుండెమీది గాయంవల్ల ఈమెహత్య కాబడిందని తెలుసుకొన్నాను.

"అందు.చేతనేనా యీచేతికి అంటినరక్తం!–"

"కావచ్చును–"

'నీకు ఉద్యోగమ ఏమిటి!–'

"ప్రస్తుతం ఏమీ లేను"

'నిజమునుబాటు!—'

'ఇచ్చటనే వీరి సంరక్షణలోనే ఉన్నాను.'

'వారి యింటనే తింటూ వారికే అన్యాయాన్ని తలపెట్టేవా! అని యిన్స్పెక్టరు అంటూండగనే చెల్లెలు హత్య సంగతి విన్న రాజా రావ్ ఆగదిలోనికి ప్రవేశించాడు!

'ఎక్కడ!— నాచెల్లెలు రుక్మిణి ఎక్కడ!—నన్ను అప్పుడే విడచి పోయిందా!—,

'ఆగు. ఎవరునువ్వు!—'

'ఆ అభాగ్యురాలి అన్నను.'

'ఈమె హత్యను గూర్చి నీకేమైన తెలియునా—'

'తెలియదండి. నన్ను వదలండి. నాచెల్లెలిని చూడనివ్వండి.'

'సమాధానం చెప్పుముందు. నీకుగాని, ఆమెకుగాని శత్రువు లున్నారా!—'

'లేరండి.'

'ఈతడు ఎవరు!—'

'ఈతను నాక్రొత్త మిత్రుడండి.'

'ఈతని సంగతి నీకు పూర్తిగా తెలుసా!—'

'మంచివాడని నా నమ్మిక.'

'ఈతడే ఆమెను బలవంతం చేశాడనీ, ఆమెవప్పు కోని కారణం చేత హత్యచేశాడని మాకు తెలియవచ్చింది. దానికి నీ ఉద్దేశం!—'

"నాకు తెలియదండి. ఫాక్టరిలో పనిచేసి సాయంత్రమే ఈమెను యింటికి పంపి నేను బజారుకు పోయానండి వంట సామానుకోసం—"

"ఆ వేళలో మీయింటిలో ఉండేది ఈతడేకదా!—"

"అవునండి—"

"ఈహత్య వీడేచేసి ఉంటాడు. ఆపిల్లవాడి తృష్ణకు అనుకూల పడని కారణంచేత కాల్చి చంపి ఉంటాడు. మాకు తెలుసు—"

"వీధిలో గొళ్ళెం ఎలా వేయబడి ఉందంటారు!'

'దానికేముంది ఎవరైనా వేస్తారు. వాడి రివాల్వరు చప్పుడుతో ఎవరో మార్గస్థులు పరుగెత్తుకొనివచ్చి ఉంటారు. లోపలి ఈ హత్యాచారాన్ని చూచి తమమీద ఎక్కడబడుతుందోనని వెనకకు పోతూ తలుపుబయట బిగించిఉంటారు—' అని యిన్స్పెక్టరు అంతా అర్థం చేసుకొన్నవాడిలా యిన్వెస్టుగేషనంతా అక్కడ వారిముందు పరచాడు.

"నాకు ఏమీ తెలియదండి—" అన్నాడు కృష్ణుడు దీనంగా యముడులా చూస్తూన్న యిన్స్పెక్టరునుచూచి—

'షటప్!—పద. ఆవిషయం కోర్టువారిముందు చెప్పుదువుగానిలే. ఊ- నడు—' అంటూ యిన్స్పెక్టరు కృష్ణుడ్ని మెడను బలంగా పట్టుకొని గెంటాడు. ఆవిసరుతో బలహీనంగాఉన్న కృష్ణుడు తూలడంతోనే వెనుక పోలీసు భటులు ఆతనిచేతులకు బేడీలు తగిలించి లారీలో కనకూర్చుండ బెట్టారు.

నిజాన్ని తెలుసుకొనలేక పిచ్చివాడుగాచూచే రాజారామ్ దృష్టిని తప్పించుకొని ఆలారీ ఠాణామార్గంపట్టిపోయింది. శవం దగ్గర కాపలాభటులు ఆతనిని శవసమీపానికి పోకుండఆపారు.

♦ ♦ ♦ ♦

"బాబాయి! ఆతడు నిర్దోషండీ! ఆతనిని రక్షించి ఉపకారము చెయ్యండి."

'నీకు తెలియదు తల్లీ! వాడికాప్రాయశ్చిత్తం కావలసిందే.'

'ఎవరోచేసిన కుతంత్రంచేతనే ఆతనికి అగతి పట్టింది. నిజంగా ఆనేరం ఆతడు చేసిందికాదు. నేను ఎరుగుదును.

'లేని నేరం మోపడం అన్యాయంకాదూ!—'

"నేరం చేయకుండ ఎందుకు బంధింపబడుతాడు"

'తెల్లగా అగుపడేవన్నీ పాలుఅనుకొంటే ఏలా? నీకు తెలియదు. వాడు ఎంతటిసాహసాన్నైనా చేయగలడు. ఎంతటి ఘోరాన్నయినా వెనుతీయకుండ చేయగలిగే సమర్థుడు. ఎంతవాడు కాకపోతే అంత పెద్దఫాక్టరిని కూలివాళ్ళనందర్నీ తనఒక్కమాటమీద కట్టుకొని సమ్మెకట్టించి కంపెనీకి తీరని కష్టాన్ని తీసుకొచ్చాడంటే ఎంత ఘటుకుడో నీవే యోచించు. ఎంతదూరంనుంచి ఎక్కడికివచ్చి మొనగాడినంటూన్నాడో చూచారా? అట్టి వాడి శిక్షకు మనం ఎదురు చూడాలిగాని రక్షించడం ఒకటా—

'చేయనినేరం ఆతని తలకుచుట్టి ఉరికంభం ఎక్కించడం అన్యాయంకదూ—'

'వాడు ఆహత్యచేసియుండలేదని నీవు ఏలా చెప్పగలవ్!— ఆతని సంగతి నీకుఏమి తెలియునని ఆతనిపట్ల ఫీజాలి!'

'నాకు తెలియును. ఆహత్యజరిగిన ఆవేళలో ఆతడు ఆయింట లేడు. పైగా ఆవేళలో ఆతనికి రివాల్వరుకూడ ఎక్కడనుంచి వస్తుంది. అదంతా కుట్ర, అన్యాయం—'

"దొంగవెధవలకు రివాల్వరే కరువు అవుతుందా? చూచావుగా పేపర్లోపడిన సమాచారం. ఆపిల్లను బలవంతపరచేడట. ఆమె వప్పుకోనని కారణంచేత "ఢాం" మనిపించాడట.'

'అదంతా అన్యాయం. ఆతనిని ఆ రిమెండులో కలుసుకొని అడిగాను. ఆహత్యగూర్చి తనకేమీ తెలియదని ప్రమాణం చేసి చెప్పాడు. అంతటి ఘోరం ఆతడు చేయగలడంటే నాకు నమ్మకము లేదు—'

'హత్యచేసినవాడు ఏమనిచెప్పుతాడు!

"సమ్మోకట్టించడం కంటేనా!"

'అదివేరు, హత్యచేసేవాడు చాల కర్కసహృదయుడై ఉండాలి. అతడు చాలమంచివాడు. చక్కనియోచనలుగల యోగ్యుడు—'

'అమ్మాయి! ఆతనిగురించి మహా తెలిసినదానిలాగే మాట్లాడ తావేం! వెళ్లు. లోనికివెళ్ళు. హంతకులపట్ల అలా మాట్లాడకూడదు'

'ఆతనిని రక్షించలేరా!'

'అసంభవం. అందులో నేను వాడివిడుదలకు ప్రయత్నమా! వాడిపట్ల నీకు అంతఅభిమానం ఎందుకుతల్లీ! నీతండ్రిని ఎదుర్కొన గలిగాడనా! లేక మనకు తీరని నష్టాన్ని కలిగించగలిగాడనా!—' అని అన్నాడు చందూరామలాల్ కుమార్తె బీనాతో కోపంగా కండ్లు ఎర్రచేసి దానితో ఆమె తండ్రికి ఎదురాడలేక తలవంచుకొని లోనికి పోయింది.

కృష్ణారావు తన చేతనే యింటివద్ద విడువ బడడం, అప్పుడే ఆతడు అరెస్టుకాబడడం బీనాకు ఆశ్చర్యం అనిపించింది. ఆతడు నిర్దోషి అని పూర్తిగా నమ్ముతూన్నా ఆ ఆనికి సహాయము చేయలేని అసహా యస్థితిలో కండ్లనీరు కారుస్తూ తనగదిలో కూర్చుంది బీనాకుమారి.

పూర్వపు ఆతని మాటలూ, చేష్టలు ఆమెలో మెరపులా మెరసి అందోళన పరస్తూన్నాయి. ఆతను ఉరికంభమున వ్రేలాడబో తాడన్న దృశ్యం ఆమెకంట ఎదుట కలగా కనబడుతూంటే ఆమె హృదయ నాళం తెగినట్టయింది. ఆవేదనను అణచుకోలేక బీనా తల గడలో తలను దూర్చి ఏడుస్తూంది.

తనగదిలోనికి ఎవరో వచ్చిన చప్పుడయింది. కుమారి బీనా తలఎత్తిచూచింది. మేనజరు గోపాల్‌సింగ్ నవ్వుతూ ఎదుట నిలచాడు.

"నాగదిని ఎందుకు ప్రవేశించారుమీరు!—"

"పూర్తిగా అవసరంగా మాట్లాడి పోదామని.

"ఏమిమాట్లాడాలి నాతో?"

"మీకు అవసరమైన విషయం"

"అంటే!—"

'అంటే అర్థంచేసు కోలేదూ?'

"ఈ అధిక ప్రసంగాన్ని విడచి ముందు బయటకు నడువండి."

"మీకు స్వస్థతగా లేదా!—"

"ఆప్రశ్నలు మీకు అనవసరం. ముందుగా అవతలకునడు. చెప్తే వినబడడంలేదూ? ఇహాముందు ఎప్పుడూ కూడ యిలారా కూడదు. తెలుసుకో. పొరపడుతే జోడు దెబ్బలు"

ఈరూలు ఆ ఆంధ్రుడికి చెందుతుందా?'

'నీకు నేను చెప్పకోవలసిన పనిలేదు. ముందు అవతలకుకదులు.

'నీవు ఆ ఆంధ్రుడితో కలసిమాట్లాడుతూన్నా వని తెలిసినా మీతండ్రిగారికి చెప్పకుండ దాచి ఉంచాను.'

గొప్ప ఉపకారం చేశావులే యిహాచాలు దయచెయ్యి"—

"తలుచు కొంటే యిప్పుడు కూడచేయగలను ఉపకారం. అన్నాడు గ్రేసుగా ఊగుతూ,

"నీ ఉపకారంనాకు అవసరంలేదు,

"ఆ ఆంధ్రుడు. అంటే ఆ కృష్ణుడ్ని విడిపించడం కూడ నీకు అక్కర్లేదా?,

"ఆ! అతనిని విడిపించగలరా? విడిపించడానికి ఏమైనా మార్గం ఉందా?—"

'కావలసినన్ని మార్గాలు,

'ఉన్నాయా?— యోచించారా?—, అంటూ కుమారి బీనా ఆతని చేరువకు మెస్మరిజమ్ వల్ల మంత్రించినట్టు ముందుకునడచింది.

'ఆ!—యోచించే ఆమాట చెప్పడానికే వచ్చాను,

యాతనిని విడిపించి పుణ్యంకట్టుకోండి. ఒకప్రాణదానం చేసు కోవడంలో ఎంత పారమార్థికం ఉందో తెలుసా?,

'అవన్నీ నాకు అనవసరం. నాకుమీావల్ల ఒక్క ఉపకారంజరుగుతే యాతనిని రక్షించి అవతలకు పంపగలను.,

'చెప్పండి. నావల్లజరిగే ఏ ఉపకారమైన నిమిషంలో చేస్తాను. యాతడు రక్షింప బడడమే నాకు కావాలి.,

చేయడానికి అంగీకరిస్తారా?,

'నిజంగా యాతని విడుదల మీావల్ల జరుగుతే నాప్రాణము కోరినా యివ్వ సిద్ధంగా ఉన్నాను.,

మంచిది. యాతని విడుదలకోసం నేను చూస్తాను. యాతడు నావల్ల రక్షింపబడడంతోనే మీారు నాతో వివాహానికి అంగీకరించాలి అని సింగు చల్లగా చెపుతూంటే యామెలోని రక్తప్రసరణ యాగింది యామాటవినడంతోనే సింగు దాడ చెల్లుమనేది. కాని యామెలోని యోచన యాక్షణంలో యామెను యాపింది.

యాపరిస్థితులలో సింగుతో పెండ్లి యామెకాదంటే కృష్ణుడు అకారణంగా ఉరికంభం ఎక్కవలసి వస్తుంది. ఇప్పుడు తనప్రేమను త్యాగంచేసి కృష్ణుడిప్రాణాలు రక్షించడమా?—లేక పుస్తకాలలోని పతివ్రతలలాగ తనశీలం కాపాడుకోవడమే ప్రధానమా?—అన్నప్రశ్న ఆమెముందు నిలువబడింది.

అప్పట్లో ఆతని రక్షణకోసం ప్రయత్నించడమే తన ధర్మం అనుకొంది కుమారి బీనా.

"ఆతనిని ఏగొర్రిండ్సుమీాద రక్షించ గలరు?"

ఆదినం ఫాక్టరీ పనిమీాద ఆవేళవరకు నావద్దనేఉండి అప్పుడే వెళ్లాడని మస్తరుపుస్తకంలో ప్రజెంటువేసి, ఆతనిచేతిలో ఏఆయుధం లేకుండనే యింటికి వెళ్లారని నేను సాక్ష్యం యిస్తాను. అతడు యింటికి

వెళ్లేప్పుడు ఆయుధములు లేకుండానే వెళ్లాడనీ, తమతో తన యింటి వరకు కలసివచ్చాడని మరి రెండుసాక్ష్యాలు యిప్పిస్తాను. దానితో కేసుపోయి ఊరుకొంటుంది.'

"ఆతడు రక్షింపబడితే మిస్సులను వివాహం చేసుకొంటానని మాటయిస్తున్నాను.'

'మాట యివ్వడంకాదు. ఆమాటకాగితంమీద పెట్టండి. ఇదిగో కాగితం—' అంటూ ఆమెకు జేబులోని తెల్లకాగితంతీసి అందించాడు. ఆమె యాకాగితాన్ని అందుకొని టేబులుమీద పరచింది వ్రాయ డానికి. అంతలో ఎవరో సింగును గట్టిగా పిలుస్తూన్న చప్పుడయింది. ఆధ్వనితో ఎందుచేతనో సింగు అధకు పాటుతో తొందరగా అక్కడ నుంచి కదలిపోయాడు.

ఆతని అదరుపాటును గుర్తించిన బీనా తనిని వెంబడించ ఎందు చేతనో మనసుకరిగిఆతనిని రహస్యంగా వెనుకను చి అనుసరి చింది. వీధివర డాలో కాబూలివేష లో వేచియున్న వ్యక్తిని సమీపించాడు గోపాల్‌సింగ్—

'ఇక్కడకే వచ్చారా మీరు—'

'ఆ. వచ్చాను. ఏమిచేయాలి! మీయింటికి ఎన్నిమారులు తిరి గినా మీజాడ అగుపించడంలేదు. అంచేత యిక్కడకే వచ్చాను. అవ సరంతీరిన తరువాత కనబడరుగా—'

'ఉష్- గట్టిగా మాట్లాడకు. నాఆఫీసుగదిలోనికిరా—' అంటూ మేనేజరు సింగు— ఆతనిని తన ఆఫీసుగదిలోనికి తీసికొనిపోయాడు.

'ఇవిగో నీకోసమే దాచి ఉంచాను, అంటూ ఆతని చేతిలో కొన్ని నోట్లను ఉంచాడు డ్రాయిరు సొరుగులోనుంచితీసి. ఆవ్యక్తి వాటిని ఓనిమిషం లెక్కపెట్టుకొన్నాడు.

'ఏం!—మూడువందలే యిచ్చారేం?'

'ఖాన్! మనము అనుకొన్న ప్రకారం హత్యజరుగనే లేదు. వాడిని కొట్టకుండ మరొక స్త్రీని కొట్టడంకదూ జరిగి ది!-

'దానికి నేను ఏమి చేయును! వ్యక్తిని గుర్తి చకుండ తొందర పడి నీవే పేల్చిచంపావు.,

'పోనీ ఆహత్యకూడ నాచేతి మీాద నేకదూ జరిగింది! ఊరకే సహాయంగా నిలువబడిన మీకు అంతక ఎట ఎక్కువ యివ్వలేను. అనుకొన్న ప్రకారంజరుగ లేదు కాబట్టి అసలు యివ్వనే అక్కర్లేదు.

ఉమాటలు వదిలిపెట్టు. ఏలా అయి తేనే ఆ అంధ్రుష్ట స్త్రీతో వనుంచి తప్పి చడమేగా కావాలి! యీనేరం వాడిమీాదపడింది, వాడు అరెస్టు కాబడ్డాడు, ప్రభుత్వమే వాడిని ఉరికంభం ఎక్కిస్తు ది, ఇహ మీాశేటు కుమార్తెను నీవే వివాహం చేసుకొనవచ్చునుగా. మన చేతులలోనుంచి వాడు తప్పి చుకోకలిగినా ప్రభుత్వం బారినుంచి యిహ తప్పి చుకోలేడుగా!—ఆసొ నీకే దక్కుతూ ది—'

"ఆసాహస కూడా నేనేగా జేసి ది. ధైర్య గా ఆదినం అతనిని ఆగదిలో బంధి చి పోలీసుఠాణాకు పోనుచేసి ది నేను. లేనిపుకారు లేవదీసి వాడిమీాద నేరం అల్లిందినేను. అ తపనీ నేనేగా చేసుకొన్నది! ఆవిషయములలో .మీాసహాయం ఏమికలిగిందని అంతడబ్బు మీాకు యియ్యడం?—

'పని జరిగిపోయిందని దొంగమాటలు మాట్లాడకండి సింగు గారూ—'

"నిజం చెపుతూన్నాను. నీవల్ల జరిగిన ఉపకారం ఏముంది!'

'ఈరహస్యం దాచడమే నేను నీకుచేసే ఉపకారం. ఇచ్చివే య డి తక్కిన ఏడువందలున్నూ, .లేదా మీారు చాలా అవస్థలు పడగలరు.'

'ఓ! అద తా ము దుగనే యోచి చాను. నీవు ఈఖూనీ విష యములో అపకారం తలపెట్టినా అది జరుగనేరదని నమ్ము.'

"ఇదిగో నీ ఉత్తరం. నా అయుధములతో ఆదినం రమ్మని నీవు నాకు వ్రాసిన ఉత్తరం." అంటూ, ఆఉత్తరాన్ని పైకితీసి. మరల జేబులో ఉంచివేశాడు.

"అవును. అట్టికాగితాలు నావద్ద రెండు ఉన్నాయి. నీవు ఆ ఖూనీ కృటిలో చేస్తానని, అందుకోసం ముందుగా మరికొంతపైకము వేగంగా పంపమనీ, అవసరంవచ్చిందనీ నీవువ్రాసిన ఉత్తరాలుకూడ భద్రపరచి ఉంచాను. దానివల్ల నీకు ప్రమాదమో, నాకే ప్రమాదమో యోచించు—'.

'ఈ బెదిరింపుతో నన్ను మోసముచేయదలచావా? జాగ్రత్త. తక్కిన పదునందలు నాకు ముట్టచెప్పవలసిన బాధ్యతనీది—'

ప్రక్కనుంచి వారిసంభాషణలువింటూన్న కుమారిబీనా చట్టున లోనికి నెడలి నాలుగుమూలలా చూస్తూ అరేయి ఇబ్రహీం!

'ఇదిగో ఆగదిలో మేనేజరు సింగుగారితో మాట్లాడుతూండే వ్యక్తిని జాగ్రత్తగాచూచి, ఆతనిని అనుసరించి ఆతని బసను తెలుసుకొని ఫార్కుగేటు దగ్గర నాకోసం నిలచిఉండు. నేనువెంటనే అక్కడ కలుసుకొంటాను. చాల జాగరూకతతో ప్రవర్తించాలి.'

"కాదులోనే వస్తాను." అంది ఆమె. ఆసగ్రెంటుపోయి ఇబ్రహింఖాన్ రాకకోసం ప్రక్కగా కనిపెట్టుకొని చూస్తూన్నాడు.

కొంత సర్ణణమీద ఖాన్ ఈవలకువచ్చి ముహంలో కోపాన్ని చూపుతూ అక్కడనుండి పకదీక్షతో నడచిపోతూన్నాడు. ఇబ్రహింఖాన్‌ను వెంటాడుతూనే ఉన్నాడు.

---

## 5

"ఇన్స్పెక్టరుగారు ఎక్కడ!"

"లోపల ఉన్నారు."

'ఆయునతో అర్జంటుగా మాట్లాడవలసిఉంది, కొంచెంపోనిస్తారా.'

'డిప్యూటీ సూపరింటెంటు దొరగారు ఆఫీసు ఫైల్సును చెకింగు చేస్తూన్నారు. ఇప్పుడు ఎవరూ లోనికి పోకూడదు.'

"పోనీ- ఆసూపరింటెంటుగారికే చెప్పండి నేనువచ్చినట్టు."

"క్షమించి ఓనిమిషం నిలువండి వారే వస్తారు. పనిలోమాట చెప్తే ఆగ్రహిస్తారు దొరగారు"

'ఉష్— ఆలస్యం చేస్తే కార్యభంగం అవుతుంది. శేట్ చెందూ రామ్‌లాల్‌గారి కుమార్తె అవసరంగా మాట్లాడవచ్చిందని చెప్పండి-' అంటూ కుమారి బీనా కంగారుతో పెద్దగా మాటలాడుతూంటే లోనించి కబురువచ్చింది ఆమెను లోన ప్రవేశపెట్టమని, కుమారి బీనా లోనికి ప్రవేశించి సూపరింటెంటుకి విష్‌చేసింది.

"నేను కూర్చోడానికి అదనుకాదండి. మొన్న జరిగిన రుక్మిణీ బాయి హత్యకేసు ఋజువు కావాలంటే వెంటనే మీరు నాకారులో రావాలి."

"ఎక్కడికి?—

'హత్యచేసిన హంతకుణ్ని పట్టుకోనడానికి."

"హంతకుడు మరియొకడు ఉన్నాడా?"

'అంతా కాగితాలద్వారానే ఋజువు అవుతుంది. ఇహ నన్ను మరేమీ ప్రశ్నించక నాకారులో త్వరగ మీరు రావాలి—"

కారు పార్కుగేటు ముందు ఆగింది. ఇబ్రహీం పరుగెత్తుకొని కారు దగ్గరకు వచ్చాడు.

"కనుగొన్నారా వాడిబసను"

"ఆ వాడిని నేను ఎరుగుదును. వాడు తాగుబోతు ఆపెద్దక్లబ్బులో జూదం ఆడుతూంటాడు. వాడిపేరు ఖాన్."

"వాడి బసను కనుగొన్నావా అని అడుగుతూన్నాను. నాప్రశ్నకు నేరుగ సమాధానంచెప్పు"

"చూచాను."

'కారు ప్రక్కను నిలచి ఆయిల్లుచూపు—అంటూ సమాంటు చేసింది కుమారిబీనా యిబ్రహిం కారుఎక్కి ప్రక్కగా నిలుబడ్డాడు. సూపరింటెంటు వెర్రిగా ఆమెవంక అర్థంకానట్టు చూస్తూన్నాడు.'

'ఆపండి ఇదేవాడి యిల్లు'

'ఇన్స్పెక్టరుగారూ! లోనికి వెళ్ళడంతోనే ముందుగా వాడిని బంధించాలిమీరు. అందితమె.'

ఖాన్ అప్పుడే కోటువిప్పి గోడవంకకి తగిలించి సింగు తనకిచ్చిన నోట్లను పరుపు మీద కూర్చొని లెక్కపెట్టుకొన్నాడు.

సూపరింటెంటుతో సహారక్షక భటులను చూచి ఖాన్ దిగ్భ్రమతో లేచి నిలువబడ్డాడు.

"అరెస్టు!—ముందువాడిని బంధించండి' అన్నాడు సూపరింటెంటు రక్షకభటులు వాడి యిరుపక్కలకు చేరుకొన్నారు. బీనా కండ్లు చుట్టునూ వెతుకుతూన్నాయి. చుట్టున ఆమెకండ్లు గోడకొంకెమునకు వ్రేలాడుతూన్న ఖాన్ నల్లకోటు మీద నిలచింది. తోడనే బీనా ఆకోటు దగ్గరకు పరుగెత్తి ఆజేబులు తడుమబోతూంటే ఖాన్ భీతితో కండ్లు పెద్దవిచేసి ఆమెను ఆపడానికి కోటుదగ్గరకు పరుగెత్తుకొని వచ్చాడు. రక్షకభటులు వాడి రెండు రెక్కలు పట్టుకొని వెనుకకు లాగుకొనివచ్చాడు.

బీనా ఆతని కోటులోనుంచి ఒకకాగితంతీసి సూపరింటెంటుకి యిస్తూ—'

"ఇదిగో ఇదిచూడండి. ఇది మాస్టార్ మేనేజరు సింగు వీడికి వ్రాసిన ఉత్తరం. ఈఖాన్ సహాయంతోనే ఆసింగు రుక్మిణీ బాయిని ఖూనీచేశాడు."

"సింగుకి ఆమెను ఖూనీచేయడంలోని ప్రయోజనం?"

"రుక్మిణీబాయి ఇంట్లోనే మీాచే అనుమానింపబడి, బంధింపబడిన కృష్ణారావు అతిథిగా ఉండేవాడు. ఆతనిని నేను ప్రేమించి ఆతనితోనే స్నేహంగా తిరిగేదాన్ని. నన్ను వివాహము చేసుకోవ చూస్తూన్న మా మేనజరు సింగుకు మాస్నేహం కంఠకంగా తోచి కృష్ణారావునే తుదముట్టించ కోరికతో ఈఖాన్‌ను సహాయంగా కోరాడు. ఈతడు ఆపనికి వేయిరూపాయల లంచంతో వప్పుకొన్నాడు. కాని— పొరపాటున కృష్ణుని బదులుగా ఆమెను ఆచీకటిలో హత్యచేశారు— అని ఆమె చెప్పుతూండే—"

'ఆ చంపినది నేను కాదండి. ఆసింగే స్వయంగా ఆహత్య చేశాడండి. ఆతని రివాల్వరుతోనే ఆహత్య"

"లేదండి. ఆహత్య అతని చేతిమీాద జరిగింది కాబట్టే నాకు యిస్తానన్న వేయి రూపాయలకు బదులు ఈమూడువందలు యిచ్చాడండి. ఇప్పుడే ఈపైకాన్ని గర్దణ మీాద తెచ్చానండి—" అని ఖాన్ చెప్పుతూండగనే ఆయింటి చుట్టూ జనంమూగారు. ఖాన్ చెప్పుకొంటూన్న స్టేటుమెంటు వింటూన్న జనసమూహములోని సాహేబు పెద్ద కేకతో—"

"సార్!— నాకూ తెలుసండి ఆసమాచారం—" అన్నాడు. అందరూ ఆ కేక వచ్చిన దిశకుచూచారు.

ఆ మహమ్మదీయుడు సమూహాన్ని త్రోసుకొంటూ ముందుకి వచ్చి సూపర్నెంటుకి సలాం చేసి—

"సార్!—ఆదినం ఆచీకటిలోనుంచి, హత్య జరిగిన యింటివైపు నుంచే సింగు భీతిగా పరుగెత్తుకొని వచ్చి నాబండిలో కూర్చున్నారండి

"నీవు ఎవరవు?"

"నేను టాంగా బండి తోలేవాణ్ణిసండి."

"ఆవేళలో నీవు అక్కడ ఎందుకు ఉన్నావ్."

"అప్పుడే వర్షం మేఘం వేసిఉంది. నాకు కడుపుపనిమీద పబ్లిక్ మరుగుదొడ్డికి పోయి తిరిగిరావడంతో అప్పుడే ఆయన ఆదిశ నుంచి పరుగెత్తుకొని వచ్చాడు. నాబండిలో కంగారుగ కూర్చొని పోయేచోటు చెప్పకుండ బండి త్రోలమన్నాడు. ఆయన యింటివద్ద దిగవిడచినందుకు ఐదురూపాయలుకూడ నాకు యిచ్చాడు. అప్పటికి నాకు 5 రూపాయలు యిచ్చినకారణం అర్థంకాకపోయిన యిప్పుడు ఖాన్ చెప్పుసమాచారాన్నిపట్టి యాతడే హత్యచేసినట్లు గ్రహించు కుంటున్నాను.

ఖాన్ అరెస్టుకాబడి సంకెళ్లతో లారీలో కూర్చుండబెట్టి ఠాణాకు తీసుకొని వచ్చివేశారు.

---

## 6

సింగుదగ్గర దొరకిన ఉత్తరాలవల్ల, ఖాన్‌దగ్గర దొరకిన ఉత్తరాలవల్ల ఖాన్‌సింగులు హంతకులని నిర్ధారణ కాబడింది. పైగా టాంగా సాహేబు సాక్ష్యంతో కేసుబలపడి ఖాన్‌సింగుల నేరానికి ప్రాయశ్చిత్తంగా వారిద్దరకు ద్వీపాంతరవాసం శిక్ష విధింపబడింది. కృష్ణుడు ఆఉత్తరక్షణంలోనే విడుదల కాబడ్డాడు—

బీనా నీవే సహాయపడి రక్షించకపోతే నేనీప్రపంచాన్ని ఈపాటికి మరచి ఉందునుకదా!"

అందుకే కదూ న్యాయం జయస్తుందని పెద్దలవాక్యం

"అదిగో మీనాన్నగారు వస్తూన్నారు"

'అమ్మాయి! నీమూలంగా సింగు ద్వీపాంతరవాసం పోయాడటగా!

"వాడికి ఆశాస్తి జరుగవలసిందే! వాడిచేసిన నేరానికి అసలు వాడి ప్రాణాలు తీసినా పాపం లేదు."

'నీవు ఆకృష్ణారావునే వివాహంచేసు కొంటావని పుకారుగా ఉంది. ఎంతనిజం!—'

'పుకారు ఏమిటి!—అదేనా నిశ్చయం!—'

వాడికేం ఉందని'

ఇదిగో కృష్ణారావుగారు యిక్కడనే ఉన్నారు. ఆయనకు ఏమి ఉండనికిదూ మీరు అడిగేది! విశాలభావాలు ఉన్నాయి. చక్కగా అందంగా నాకండ్లకు అగుపడే సౌందర్యంఉంది. నన్ను రంజింపచేసే వాక్ చమత్కారంఉంది. యిహ నాకు ఏమికావాలి—" అంటూ ఏకి ధాటిగా ఆమె లెక్చరుకొడుతూంటే—

'చివరకు ఆంధ్రుడనా నీవు వివాహమాడేది!'

"ఎవరైతేనేం! ఉన్నతకోరికలుగల విశాలహృదయులు ఆంధ్రులే అని నానమ్మకం. ఆనమ్మకం యిప్పుడు మరినాలో స్థిరపడింది. నాకోరికకు ఎదురుచెప్పకండి బాబాయి—" అనికుమారి బీనాద్రైస్యంగా అడుగుతూంటే చంద్రూరామలాల్ ఎదురుచెప్పలేక పోయాడు.

బీనా కుమారి వివాహం కృష్ణుడితో వైభవంగా జరిగిపోయింది. ఫ్యాక్టరీఅంతా కృష్ణుని ఆధిపత్యంలోనే నడపబడుతూంది—

ఆఫ్యాక్టరీ అధికారం తనచేతులలో నడపబడుతూండడంచేత కర్షకజనులను ఒకకంటచూస్తూ, కీర్తిని గడిస్తూన్నాడు.

మనకృష్ణారావే టిటాగర్ ఫ్యాక్టరీకి అధికారి అవడంచేత ఆంధ్రులకు ఉద్యోగం కావలిస్తే అతనికే అప్లయిచేయండి—

సమాప్తి.

## మల్లాది వారి క్రొత్త నవలలు

1 పాంచజన్యం | 2 దేవదత్తం
3 సత్యభామ | 4 జలక్రీడ
5 ముద్దుపళని | 6 స్వర్ణకంకణం
7 ఎక్కడా — లేకపోతే? | 8 అక్క — దిక్కు — 2

వలయువారు —

కందుల గోవిందం,

పబ్లిషర్. రాజమండ్రి.

# అద్భుత ప్రశ్న ఫలము

మీకు మంచిరోజులు, పెండ్లి, ఉద్యోగము, లాటరీ, ధనాదాయము మొదలైన ఏవిషయములలో ప్రశ్న కావలసినను యీదిగువనున్న రీతిగా తెల్లకాగితముమీద పూర్తిచేసి పంపండి. చోర రాజకీయ ప్రశ్నలడగవద్దు. గవర్నమెంటు పరీక్షాఫలితాలుకూడ ముందుగానే సకాలంలో చెప్పుదుము. ప్రశ్న 1కి రు 1-10-0 చార్జి. వి. పి. సిస్టము లేదు. సమాధానము నాల్గవరోజున పంపుదుము.

1 పేరు (యింటిపేరుతో సహా) 2 వయస్సు (నడిచే సంవత్సరము) 3 కాలము (మూడుజాములు వ్రాయక సరియైన కాలము) 4 ప్రశ్న (వివరాలతో) 5 ఒకనది పేరు 6 ఒక పుష్పం పేరు 7 1 నుం. 100లోపు ఒక అంక. 8 ప్రశ్నల్లో కావలసిన వివరాలు.

ప్రొఫెసర్:- ఎమ్. ఎల్. ఎన్. శాస్త్రి,
వివేకానంద జ్యోతిషాలయం
ఉల్లితోటవీధి, రాజమండ్రి. తూ॥ గో॥ జిల్లా.

[illegible] శ్రీ చింతామణి ప్రెస్ రాజమండ్రి